ఇమ్మహా భారతంబిమ్ముల బాయక
విహితావధానులై వినుచునుండు
వారికి విపుల ధర్మారంభ సంసిద్ధి
యగుఁ బరమార్థంబ యశ్రమమున
వేదముల్ నాలుగు నాది పురాణముల్
పదునెనిమిదియుఁ దత్ప్రమిత ధర్మ
శాస్త్రంబులును మోక్షశాస్త్ర తత్త్వంబులు
నెఱిఁగిన ఫలమగు నెల్లప్రొద్దు
దానములను బహువిధ క్రతుహుతజప
బ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్య ఫలము వడయఁబోలు నశేష పా
ప క్షయంబునగు శుభంబు పెరుగు.

ఆయురర్థులకు దీర్ఘాయు రవాప్తియు
నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మ సంప్రాప్తియు
వినయార్థులకు మహావినయ మతియుఁ
బుత్రార్థులకు బహుపుత్ర సమృద్ధియు
సంపదర్థుల కిష్టసంపదలును
గావించునెప్పుడు భావించి వినుచుండు
వారల కిమ్మహాభారతంబు
భక్తియుక్తులైన భాగవతులకు, శ్రీ
వల్లభుండు భక్త వత్సలుండు
భవ భయంబులెల్లఁ బాపి యిష్టార్థ సం
సిద్ధిఁగరుణతోడఁ జేయునట్లు.

— నన్నయ్య

# మహాభారత పారిజాతము



సంపాదకులు :


భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి

ఎం. ఏ. పిహెచ్. డి.

# మహాభారత పారిజాతము



అమితాఖ్యానక శాఖలంబొలిచి వేదార్థామలచ్ఛాయమై
సుమహావర్గ చతుష్క పుష్పవితతిన్ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణకీర్తనార్థఫలమై, ద్వైపాయనోద్యాన జా
త మహాభారత పారిజాత మమరున్ ధాత్రీసుర ప్రార్థ్యమై

(నన్నయ్య)

వేదవ్యాసుడొక ఉద్యానవనము. అందు భారతము పారిజాతము వంటిది. ఆ చెట్టు ఆఖ్యాన ఉపాఖ్యానము లనెడి వివిధ శాఖలతో విరాజిల్లుచున్నది. నాల్గు వేదముల అర్థమే దాని నీడ. ధర్మార్థకామ మోక్షములను పురుషార్థములే పూగుత్తులు. నరనారాయణుల మహోన్నత గుణములను గానము చేయుటయే ఆ చెట్టునకు పండిన పండు. ఈ భారత పారిజాతమే వేద వేత్తలచే కోరదగినది.

శ్రీ దేవరకొండ శేషగిరిరావు ఎం. ఏ.
భారత కథలు - అంతరార్థము.

సర్వస్వామ్య సంకలితము

ఆంగీరస, భాద్రపద బహుళ దశమి

22 సెప్టెంబర్, 1992.

ప్రతులు 1000

శివశ్రీ ప్రచురణలు

భావనగర్ కాలనీ, పొన్నూరు.

గుంటూరు జిల్లా. 522 124

మూల్యము 15/-

ముద్రణ :

కమల ఆర్ట్ ప్రింటర్స్

బోస్‌రోడ్, తెనాలి.

# సంపాదకీయం

అచతుర్వదనో బ్రహ్మా, ద్విబాహురపరో హరిః ।
అఫాలలోచన శ్శంభుః, భగవాన్ బాదరాయణః ॥
వ్యాసం. వశిష్ఠ నప్తారం, శక్తేః పౌత్రమకల్మషం ।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥

## భారతము - విజ్ఞాన సర్వస్వము

పూర్వము నైమిశారణ్యంలో శౌనకాది మహర్షులు సత్రయాగం చేశారు. వివిధ పురాణ పుణ్య కథలు చక్కగా చెప్పగల సూతమహర్షి ఒకనాడు అక్కడకు వచ్చాడు. శౌనకాదులు ఆతనిని భక్తితో పూజించి, సత్కరించారు. కథా శ్రవణ కుతూహలురై అర్థించారు. వారి శ్రద్ధాసక్తులకు సంతోషించి ఆరో మహర్షిణి తనయుడు నావలన మీరే కథ వినాలని అనుకొంటున్నారో చెప్పండని అడిగాడు. వారు హృద్యమై, అపూర్వమైన ఏ కథ వింటే పాపములు తొలగిపోయి, సమగ్రమైన విజ్ఞానం బోధపడుతుందో అది వినిపించండని ప్రార్థించారు.

సూతమహర్షి వారి కోరిక మన్నించి, వేదవేత్తయైన వేదవ్యాస మహర్షిచే రచింపబడి, ఆయన శిష్యుడైన వైశంపాయనునిచే (పరీక్షిత్తు తనయుడు) జనమేజయునకు చెప్పబడిన భారతం నేను మీకిప్పుడు వినిపిస్తానని చెప్పాడు. అంటే భారతం విజ్ఞాన సర్వస్వమన్నమాట.

## భారతమే ఒక పారిజాతము

వేదార్థమును వివరించిన ఆ భారతంలో శ్రీకృష్ణుని మహత్త్వము, పాండవుల విపుల సద్గుణములు విపులంగా వర్ణింపబడ్డాయి. చతుర్విధ పురుషార్థములు, వాని సాధన విధానములు ప్రకటింపబడ్డాయి. అందులో ఉన్న ఎన్నో ఉపాఖ్యానములు శాఖోపశాఖలుగా విస్తరింపబడ్డాయి. కోరిన వారికి కోరినన్నెల్ల వివిధార్థములను ఫలింపజేసే భారతమే నిజానికి ఒక పారిజాతం.

అందుకే విశ్వజనీనమైన ఆ భారతాన్ని ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రమని, అధ్యాత్మవిదులు వేదాంతమని, నీతి విచక్షణులు నీతిశాస్త్రమని, కవి వృషభులు మహాకావ్యమని లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని, ఇతిహాసకులు ఇతిహాసమని, పౌరాణికులు బహుపురాణ సముచ్చయమని కొనియాడారు.

అట్టి మహాభారతాన్ని సంస్తవనీయమైన భావ్య కవితావేశము, విజ్ఞాన సంపద, సంయమనము (ఆత్మ నిగ్రహము) కలిగిన వ్యాసమహర్షి విశ్వ శ్రేయస్సుకై సంకల్పించి రచించాడు. ఋక్, యజు, స్సామ, అధర్వణములనేవి నాలుగు వేదములు కాగా, వాని సారమని కీర్తింపబడిన ఈ భారతం పంచమవేదమై ప్రసిద్ధికెక్కింది. వివిధములగు శ్రుతులకు, స్మృతులకు, పురాణములకు అభిప్రాయభేదమేర్పడినప్పుడు వానికి సమన్వయాన్ని సాధించి పురుషార్థముల విషయంలో ప్రమాణంగా గౌరవింపదగింది భారతం.

పుణ్యశ్లోకో నలోరాజా, పుణ్యశ్లోకో యుధిష్ఠిరః ।
పుణ్యశ్లోకాచ వైదేహీ, పుణ్యశ్లోకో జనార్దనః ॥

మహత్వపూర్ణమైన ఈ మహాభారతంలో నూరుగురు మహాపురుషుల దివ్యచరిత్రలు వర్ణింపబడ్డాయి. ఆత్మతత్త్వమును ప్రతిపాదించి, చైతన్యమును జాగృతపరచి, భక్తిని ప్రబోధించి జ్ఞానమును ప్రకాశింపజేసి, యోగమును ప్రసాదించి, విధివిహిత కర్మముల యెడ ఆసక్తిని పెంపొందించి, మానవులను కర్తవ్య నిష్ఠులను చేయగల భగవద్గీత వంటి నూరు గీతలూ ఇందులో చోటుచేసుకొన్నాయి. (ఉదా, సనత్సుజాతీయగీత, ఉద్ధవగీత, అనుగీత, పాండవ గీతలు, భ్రమరగీతలు మొదలైనవి.)

ఆ మహనీయుల పుణ్యచరిత్ర వినడంవల్ల కలిదోషం నశిస్తుంది. పుణ్యం లభిస్తుంది. ధర్మబుద్ధి ఏర్పడుతుంది. మనిషి మహాత్ముడయ్యే విధానం అవగతమవుతుంది. గీతా ప్రబోధంవల్ల ఆత్మతత్త్వాన్ని అవగాహన చేసుకొంటే జన్మచరితార్థమై ముక్తిమార్గం గోచరిస్తుంది.

## భారత కథా పరమార్థము

భరత వంశ చరిత్రతో ప్రారంభమైన ఈ మహాభారతం త్రిపురాసుర సంహారకథతో ముగియటం పరిశీలించినప్పుడు భారత కథా పరమార్థమేమిటో మనకు బోధపడుతుంది. 'స్థూల, సూక్ష్మ కారణములకు అతీతమైన ఆధ్యాత్మిక తత్త్వం ఇందులో ముఖ్యంగా తెలియదగినది' అనే సత్యం వెల్లడి అవుతుంది. జీవుడు దేవుని సన్నిధి చేరే విధానం సూచితమవుతుంది. నరుడు నారాయణుడయ్యే విధం అనుభవానికి వస్తుంది.

ఇహపర సుఖములకు సాధకమైన భారత కథ వినడం వలన కోరిన కోర్కెలు నెరవేరుతాయి. ఆయురర్థములు సిద్ధిస్తాయి - పాపం నశిస్తుంది. ధర్మం వృద్ధి చెందుతుంది. భవబంధములు తొలగిపోయి జన్మరాహిత్యం కలుగుతుంది.

అందుకే చాళుక్యవంశ భూషణుడైన రాజరాజ నరేంద్రుడు బహుయాగముల ఫలము పరమార్థముగా చెప్పబడిన భారత కథా శ్రవణ, ప్రవణమైన మనస్సుతో ఆ మహాభారత బద్ధ నిరూపితార్థమును తెనుగున రచియింపజేయ సంకల్పించాడు. ఆ విధంగా తాను తరించటమేకాక, లోకాన్ని కూడ తరింపజేయటానికి పూనుకొన్నాడు.

సంహితాభ్యాస పరులు, అవిరళ జపహోమతత్పరులు, నిత్యసత్య వచనులు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతులు, వాగను శాసనులు, ఉభయ కవిమిత్రులు, అమలోదాత్త మనీషులు, కావ్యశిల్ప నిర్మాణ దక్షులు, సకలాగమార్థ సంవేద్యులు, కళాకోవిదులు, విద్యాపారగులు అయిన కవిత్రయం వారు ఆ భారత వాగమృతాన్ని తెనుగులోకి అనువదించి, మనకు అందించారు. అది మన అదృష్ట విశేషం.

కవిత్రయ భారతం ప్రధానంగా పద్యకావ్యం కావటంచేత అందరికి అందుబాటులో ఉండేందుకు కొందరు వచనంగా అందించారు. కథాంశమును విశ్లేషణ చేస్తూ విజ్ఞాన దాయకములైన విమర్శలందించారు మరి కొందరు. సామాన్యులకు అర్థమయ్యే రీతిలో భారతకథా పరమార్థమును ఈ విధంగా పొందు పరుస్తున్నాము మేము.

# కృతజ్ఞతలు

ఈ మహాభారత పారిజాతము ప్రకటించటానికి ఉత్సాహంగా ముందుకు వచ్చిన శ్రీ మోదడుగుల శ్రీరాములుగారి కుమారులు దైవభక్తి, ధార్మిక బుద్ధి కలిగి, విధి విహిత ధర్మ కర్మముల యందు ఆసక్తి చూపుట చూచి, సంతోషించి నేను ఈ ప్రయత్నమునకు పూనుకొన్నాను. వారికి గల మాతా పితృ భక్తి అపారము. పరస్పర సోదర ప్రేమ అనిర్వచనీయము. అందుకు నేను వారిని మనసార అభినందిస్తున్నాను. నాపై విశ్వాసముంచి ఈ కార్యభారమును అప్పగించినందుకు ధన్యవాదములు తెలియజేస్తున్నాను. భగవంతుడు వారందరికి ఆయు, రారోగ్య, సౌభాగ్యములను ప్రసాదించి కాపాడుగాకయని ఆ పరాత్పరుడగు శ్రీకృష్ణ పరమాత్మను చేతులు జోడించి ప్రార్థిస్తున్నాను. వారి తల్లిగారికి ఉత్తమ లోకప్రాప్తి కలగాని కోరుకొంటున్నాను.

"మహాభారత పారిజాతము"నకు తమ రచనలు అందించి దోహదం చేసిన పూజ్యులు బ్ర. వే. శ్రీ మల్లాప్రగడ శ్రీరంగారావుగారికి, శ్రీ వితాల రామచంద్ర మూర్తిగారికి, డాక్టర్. చెరువు సత్యనారాయణశాస్త్రిగారికి, మాన్య మిత్రులు శ్రీమల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి, శ్రీ తాడేపల్లి పతంజలిగారికి భక్తితో, కృతజ్ఞతాపూర్వకమైన నా నమస్సుమాంజలులు సమర్పించుకొంటున్నాను. సముచితమైన సలహాలనిచ్చి, తన సహాయ సహకారములందించిన మా సహోపాధ్యాయులు బ్ర. వే. నిష్ఠల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నా హృదయపూర్వక అభివందనములు తెలియజేస్తున్నాను.

గ్రంథమును సకాలంలో చక్కగా ముద్రించి ఇచ్చిన సహృదయులు, సారస్వత ప్రియులు **'కమల ఆర్ట్ ప్రింటర్స్'** (తెనాలి) అధినేతలు అయిన **శ్రీ డి. సుధాకర్** గారికి, వారి కార్యాలయ సిబ్బందికి నా కృతజ్ఞతలు అందజేస్తున్నాను.

ఇంక "ఎందరో మహానుభావులు అందరికి నా వందనములు" సమర్పిస్తూ....

**డాక్టర్. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి**

# విషయసూచిక

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేషుండు విజ్ఞాన సం
పద్విఖ్యాతుడు సంయమిప్రకర సంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుడర్థి లోకహితనిష్ఠంబూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్ (తిక్కన)

వినుత పరాక్రముల్ ధృతవివేకులు సత్యసమన్వితుల్ యశో
ధనులు కృతజ్ఞులుత్తములు ధర్మపరుల్ శరణాగతాను కం
పనుల నఁగాఁ బ్రసిద్ధులగు భారత వీరుల సద్గుణాను కీ
ర్తనముల నొప్పుదాని, విదితంబగు దాని సభాంతరంబులన్.

ఆయుష్యంబితిహాసవస్తు సముదాయంబైహికాముష్మిక
శ్రేయఃప్రాప్తి నిమిత్తముత్తమ సభాసేవ్యంబు లోకాగదు
న్యాయై కాంతగృహంబునాఁ బరఁగి నానా వేదవేదాంత వి
ద్యాయుక్తంబగు దానిఁజెప్పదొడఁగెందద్భారతాఖ్యానమున్. (నన్నయ్య)

# భారత వాగమృతం

శ్రీ విశాల రామచంద్రమూర్తి
ప్రిన్సిపాల్
మాతృశ్రీ ఓరియంటల్ కాలేజి
జిల్లెళ్ళమూడి.

మహాభారతం భారతీయుల విజ్ఞాన సర్వస్వం. ఆర్ష సంస్కృతికి నిధానం. మానవేతిహాసం 'మహత్త్వాత్ భారవత్త్వాచ్చ మహాభారతముచ్యతే' అని ఆర్యోక్తి. మానవ జీవితంలోని మిట్టపల్లాలు, కష్టనష్టాలు, కీర్త్యపకీర్తులు, అన్నీ ఎన్నో సందర్భాల్లో ఎన్నెన్నో రీతుల్లో సమగ్రంగా, సుందరంగా, వాచ్యంగా, వ్యంగ్యంగా వివరింపబడ్డాయి. పురుషార్థాలు, తత్సాధనలు, సాధక బాధకాలు, సిద్ధులు అన్నీ ఇందులో ఉన్నాయి. ధర్మాలు, ధర్మ సూక్ష్మాలు, వాటి వివరాలు, పురుషకారం, దైవం, విధి అనుల్లంఘనీయత - ఈ గ్రంథంలో చెప్పబడినట్లు మరే గ్రంథంలోనూ లేదు.

ఎన్నో ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలు, నీతులు, వాటిని నిరూపించే కథలు, వేయేల? "ఇక్కడ చెప్పనిది ఎక్కడా చెప్పబడలేదు. ఎక్కడ ఏది చెప్పినా భారతం లోనిదే" అని పెద్దల నిష్కర్ష.

"వేదములకు, నఖిలస్మృతి
వాదములకు, బహు పురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామ మోక్ష స్థితికిన్."

వేదాలకు, ధర్మ శాస్త్రాలకు, పురాణాలకు సమన్వయం సాధిస్తూ, ధర్మార్థ కామ మోక్షాల విషయంలో ప్రమాణంగా నిలిచింది మహాభారతం.

ఉపనిషత్సారమైన భగవద్గీత, ఆత్మజ్ఞానాన్ని ప్రబోధించే సనత్సుజాతీయం కూడ భారతం లోనివే. ఇహ పర ధర్మాలకు, వ్యష్టి-సమష్టి ధర్మాలకు మధ్య సంఘర్షణని పరిహరిస్తూ సుఖశాంతులతో మనుగడ సాగించడానికి వలసిన సంసార తరణోపాయాన్ని అందించేది భారతమే. ధర్మాద్వైతమే భారత పరమార్థము. ధర్మమంటే ఆచరణ, నిత్య వ్యవహారంలో మనసా వాచా కర్మణా ధర్మమే అనుష్ఠింపబడాలని, అధర్మం నశించేదని, మనుగడలోని కష్టనష్టాలకు అధర్మాచరణమే మూలమని, సుఖశాంతులకు ధర్మానుష్ఠానమే రాచబాట అని నొక్కి చెప్పేది భారత సంహిత.

స్థూలంగా ఇది కురు పాండవ వృత్తాంతమే అయినా త్రికాలా బాధ్యమైన సత్యాన్ని, ధర్మాన్ని ప్రతిష్ఠించడమే భారత పరమోపదేశం. మానవుల అల్పత్వం. అలసత్వం, అజ్ఞానం ఎలా పతనానికి దారితీస్తాయో, ఔన్నత్యం. సత్యనిష్ఠ, ధర్మపరత ఎలా నిలుస్తాయో, గెలుస్తాయో సోదాహరణంగా నిరూపించిన గ్రంథం భారతమే కదా ! అర్థ కామాల విజృంభణ వల్ల ధర్మ మోక్షాలు ఎలా మరుగున పడతాయో, దైవ సహాయం వల్ల సత్య ధర్మాలు ఎలా గెలుస్తాయో, పునః ప్రతిష్ఠితాలవుతాయో, మానవత్వం ఎలా సార్థక మవుతుందో - అంటే వర్ణాశ్రమ ధర్మాలు పూర్ణ మానవత్వానికి ఎలా దోహదకారులో వ్యాస భగవానుని లేఖినిలో, కవిత్రయ ఆంధ్రీకరణలో ప్రసన్న గంభీరమైన శైలిలో ఉపదేశింపబడడం భారత మహత్త్వం.

"ఎఱుక గల వారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠి గదలక ధర్మం
బెఱుగుచు ఎఱిగిన దానిని
మఱువ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్" [1-3-203]

అని భారతం ఉపదేశిస్తోంది. పెద్దల జీవిత చరిత్రలు తెలుసుకుంటూ, ధర్మ మర్మాలను గుర్తించి వర్తించడం ఇహ పరాలలో శ్రేయోదాయకం కదా !

సత్యము, ధర్మము ఈ ప్రపంచానికి ఆధారం. అవి శాశ్వతాలు అసత్యం వల్ల, అధర్మం వల్ల సత్య ధర్మాలకు తాత్కాలికంగా గ్లాని ఏర్పడినా, అంతిమ విజయం సత్య ధర్మాలదే. సత్య ధర్మాలను రక్షించే దక్షత ఉండీ, ఉపేక్షించే వారికి ప్రమాదం కలుగుతుందని హెచ్చరిస్తోంది భారతం. సత్యధర్మాలను సర్వేశ్వరుడు సదా సంరక్షిస్తాడనే పరమ సత్యాన్ని కూడా ప్రకటిస్తోంది.



"సారపు ధర్మమున్ విమల సత్యము పాపము చేత బొంకుచే
బారముఁ బొందలేక చెడబారిన దైన యవస్థ దక్షులె
వ్వార లుపేక్షసేసి రది వారల చేటగు గాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభ దాయక మయ్యును దైవముండెడిన్."

మానవ మనస్తత్వంలో ఎంత చీకటి ఉన్నదో, ఎన్ని లోపాలు ఉన్నాయో, ఎన్ని వంకరలు తిరుగుతుందో, వాటివల్ల ఎంత అల్పత్వం ప్రాప్తిస్తుందో ఒకవైపు.

సత్యనిష్ఠ, ధర్మపరత, ధీరత, ఉదాత్తత, ధర్మాధర్మ సంఘర్షణ, తాత్కాలికంగా అధర్మం గెలవడం, దైవ సహాయం, ధర్మ విజయం మరోవైపు - కురుపాండవ గాథ ఆధారంగా మనకు దర్శనమిస్తాయి భారతంలో.

ఈ కథ ఆధారంగా నవరసపోషణ, పాత్ర చిత్రణ, మృదు మధురమైన సంభాషణలు, వాద ప్రతి వాదాలు. సుందర సుకుమార వర్ణనలు -, ఇది అది అననేల ? -భావనాహ్లాదాన్ని కలిగిస్తూ, కర్తవ్యోపదేశం చేస్తూ, సర్వ మానవ సమాదరణీయమై, నిత్యనూతనమై, జ్ఞాన విజ్ఞాన నిధానమై, అజరామరమై, అక్షరమై, ప్రకాశిస్తున్న వేదసారం. పురాణ సముచ్చయం, ప్రబంధ మండలి - విశేషించి నరనారీ హృదయా వర్జకమూ అయిన భారతీయ సంస్కృతీ శిఖరం సంస్కృతాంధ్ర మహాభారతం.

మానవ జీవితం అంతా అది భౌతికమైనా. ఆధ్యాత్మికమైనా భారతంలో ప్రతిఫలించింది. సుఖశాంతుల సాధనే కదా ; జీవితం అంటే, అది తనకు, సమాజానికి ఎలా సిద్ధిస్తాయో, అందుకు జీవితంలో ధర్మ మార్గాన్ని ఎలా అనుసరించాలో, ఏది స్వీకరించాలో. ఏది పరిహరించాలో తెలియ జెప్పేది భారతం,

సంకుచిత స్వార్థం, అన్యాయ ఎలా పతన హేతువులో సోదాహరణంగా వివరిస్తూ, త్యాగం. ఔదార్యం, భూతదయ. ధర్మపరత వంటి ఉత్తమ గుణాలు పెంపొందించుకోవాలనే ఉపదేశాన్ని ఉదాహరణ పూర్వకంగా అందిస్తోంది భారతం. ధర్మాలతో పాటు. ధర్మసూక్ష్మాలు కూడా భారతంలో ఇమిడి ఉన్నాయి.

"భూత హితంబుగా పలుకు బొంకును సత్యఫలంబునిచ్చు, త
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్లు; ప్రా
ణాతురుడైనచో, పరిణయంబున యందును పల్కు-బొంకు స
త్యాతిశయంబు; యంద్రుడు మహితాత్మక ! యిట్టివి ధర్మ సూక్ష్మముల్."
అని ప్రబోధిస్తాడు ధర్మవ్యాధుడు.

'కాల మూలంబు సర్వంబు'. మనం అనుభవించే సుఖదుఃఖాలకు 'కాలమే ప్రధాన కారణం అంటుంది భారతం. అరణ్య వాసారంభంలో దిక్కు-తోచక అలమటిస్తున ధర్మరాజును ఊరడిస్తూ....

"కాల విపర్యయంబున సుఖంబును దుఃఖము వచ్చుచుండు; నె
క్కా-లము నేటికిన్ ధ్రువము కాదు సుఖంబును, దుఃఖమున్ మహీ
పాల ! బుధుండు తద్వ్విధ భంగు లెరింగి ప్రమోద ఖేద సం
శీలుడు కాడు - లెంటను ప్రసిద్ధ పథంబున నప్రమత్తుడై!."
అని సార్వకాలిక సందేశం వినిపిస్తాడు వ్యాసమహర్షి.

పురుష కౌరానికి ఉన్న పరిమితి, దైవానికున్న సర్వశక్తిమత్వం సమర్థంగా నొక్కి- చెప్పింది భారతంలోనే. భారతంలోని ఘట్టాలు నిత్య జీవితంలో మనకు ఎదురయ్యేవే. ఆ యా పాత్రలు ఆ యా సందర్భాల్లో ఎలా ప్రవర్తించాయో, ఎలా ఆలోచించాయో, వాటికి ఎలాంటి ఫలితాన్ని పొందాయో నిరూపిస్తూ కర్తవ్యాన్ని బోధిస్తున్నది. పాండవులు, కౌరవులు - మళ్ళీ వారిలో ధర్మ జాదులు, దుర్యోధనాదులు, వాళ్ళ గుణ దోషాలు, జయాపజయాలు, మానావమానాలు అన్నీ మానవాళికి ఆనందోపదేశాన్ని అందించేవే.

"విధి వర్షం లాంటిది. కొందరికి అనుకూలం - కొందరికి ప్రతికూలం." ఏమైనా, విధి దాట రానిది. తప్పించుకోలేనిది. అందుకే, దాన్ని 'నియతి' అన్నారు పెద్దలు - ఎవరికైనా - అంటే మంచివాడికీ, చెడ్డవాడికీ, పండితుడికీ, పామరుడికీ, ఉన్నవాడికీ, లేనివాడికీ కూడా కష్టసుఖాలు తప్పవు. "ఆగమాపాయినోఽనిత్యాః తాన్ తితిక్షస్వ భారత !" అని కదా ! గీతోపదేశం ద్వంద్వాలు అపరిహార్యాలు అనే జ్ఞానం కలిగించడం కూడా భారతోద్దేశమే.



లౌకికమైన కథ ఆధారంగా విధి ప్రభావాన్ని మానవాళికి ఎఱుక పరచి, సత్య ధర్మాల వైపు వారిని నడిపించి, లోక కల్యాణం సాధించడమే భారత పరమార్థం. ఇందులో కథాకథనంతో పాటు కవితా సౌందర్యం కూడా ఉండడం వల్ల జనరంజకమై బహుళ ప్రచారాన్ని పొందింది ఈ గ్రంథ రాజం.

భారతం మన కథే. ఈ కథలోని సన్నివేశాల్లోని పాత్రలతో తాదాత్మ్యం చెందుతాం మనం. ఆ పాత్రలు మన ఎదుట నడయాడుతున్నట్లు, మనను పలక రిస్తున్నట్లు "ఇది మంచి - ఇది చెడు - ఇలా చెయ్యి, అలా చెయ్యొద్దు" అని మనల్ని హెచ్చరిస్తున్నట్లు, నీదేమున్నది - అంతా దైవమే అని మనను ఊరడిస్తున్నట్లు, బుజ్జగిస్తూ, భుజం తట్టి ధైర్యం చెబుతున్నట్లు అనుభూతిని పొందుతాం. ఆ విధంగా వ్యాసభగవానుని రచన, కవిత్రయాంధ్రీకరణం సకలార్థ సాధకాలు, సుఖశాంతి సంవర్ధకాలు అయి, సార్థకాలైనాయి. అట్టి క్రాంత దర్శులకు నమోవాకాలు అర్పిస్తూ, ఆ రచనలను ఆరాధిస్తూ, అధీతి బోధాచరణ ప్రచారణల ద్వారా వారి ఋణం తీర్చు కోవడమే మానవాళి కర్తవ్యం.



# సర్వం విష్ణు మయం జగత్

డాక్టర్. తూములూరు దక్షిణామూర్తి శాస్త్రి

'విష్ణువు' అంటే వ్యాపన శీలం కలవాడని అర్థం - విశ్వమంతటా నిండి ఉన్నవాడని తాత్పర్యం. 'విశ్వేశ్వరుడు', 'విశ్వమయుడు' అని భావము. దుష్టశిక్షణకు, శిష్టరక్షణకు అతడు ఈ భూమిపై అనేక పర్యాయములు అవతరించాడు. ద్వాపర యుగాంతంలో భూభారతరణం కోసం 'విష్ణువే' కృష్ణుడుగా అవతరించాడు. భారత రణానికి రంగం సిద్ధం చేశాడు. ఆతని సంకల్పాన్ని అనుసరించి దేవ దానవుల అంశలతో కొందరు ఈపుడమిపై పుట్టారు. "యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్".

భరత వంశ చరిత్ర :

చంద్ర వంశంలో పూరుడు, భరతుడు మొదలైన మహారాజు లెందరో పుట్టి, కీర్తి ధనులై వర్ధిల్లారు. ఆ భారత వీరులలో బాగా ప్రసిద్ధుడైన వాడు శంతనుడు. అతని మొదటి భార్య గంగ. ఆమెకు కలిగిన సంతానంలో ఏడుగుర్ని నీటి పాలుచేసి, 8వ వాడు అయిన దేవవ్రతుణ్ణి విద్యాబుద్ధులు నేర్పి తండ్రికి అప్పజెప్పి, తన నియమానుసారం ఆమె అంతర్థానమయ్యింది.

దేవవ్రతుడు, పెరిగి పెద్దవాడై ఆ తర్వాత తన తండ్రికి దాశరాజు కుమార్తె సత్యవతిపై గల ప్రేమ నర్థం చేసుకొని, వారిరువురి వివాహానికి ప్రయత్నం చేశాడు. దాశరాజు కోరిక మేరకు వారికి పుట్టబోయే బిడ్డలకే కాని తనకు రాజ్య మక్కఱలేదని, తానసలు వివాహమే చేసుకోనని భీష్మ ప్రతిజ్ఞ చేసి భీష్ము డయ్యాడు.

శంతనునికి సత్యవతియందు చిత్రాంగదుడు, విచిత్ర వీర్యుడు అని ఇద్దరు పిల్లలు పుట్టారు. వారిలో చిత్రాంగదుడు గంధర్వ పతియైన చిత్రాంగదునితో జరిగిన యుద్ధంలో మరణించాడు. విచిత్ర వీర్యునికి కాశీరాజు కుమార్తెలైన అంబికా, అంబాలికల నిచ్చి వివాహం చేశారు. వారి కంటె పెద్దదైన 'అంబ' భీష్ముని చేతిలో ఓడిపోయిన తన ప్రియుడగు సాల్వునిచే తిరస్కరింపబడి గొప్ప తపస్సు చేసింది. శివుని వరములు పొంది తన దుఃఖమునకు హేతుభూతుడైన ఆ భీష్ముని మరణానికి కారణమైన శిఖండిగా మరు జన్మలో పుట్టింది.



విచిత్ర వీర్యుడు సంతత కామోపభోగ వివశుడై సంతతి లేకుండానే మరణించాడు. రాజ్యం అరాచకంకాకుండా ఉండేందుకై తల్లి సత్యవతి ఆదేశం మేరకు, వ్యాసుడు దేవర న్యాయాన్ని పాటించి, ధృతరాష్ట్రుడు, పాండురాజు, విదురుల జననములకు కారణమయ్యాడు. ముని తమను చేరినప్పుడు వారు ప్రవర్తించిన తీరును బట్టి అంబికా, అంబాలికలకు కలిగిన ధృతరాష్ట్ర, పాండురాజులు వికృతుల పాలయ్యారు. చక్కగా సేవించిన పరిచారిక తనయుడైన విదురుడు సుమతియై, సజ్జన స్తుతి పాత్రుడయ్యాడు. ధృతరాష్ట్రుడు గాంధారిని, పాండురాజు కుంతీ, మాద్రులను విధివిధానంగా వివాహమాడారు

ధృతరాష్ట్రుడు గుడ్డివాడు కావటం చేత, అతనికి రాజ్యాధికారం ఇవ్వటం శాస్త్ర సమ్మతం కాకపోవటం వలన పాండురాజుకు పట్టాభిషేకం జరిగింది. పాండురాజు జ్యేష్ఠునిపై గల గౌరవంతో ధృతరాష్ట్రుని సింహాసనంపై కూర్చుండబెట్టి తాను దిగ్విజయం చేసి, రాజ్యం విస్తరింప జేసి, సముపార్జించిన ధనమంతా ధృతరాష్ట్రుని అధీనం చేస్తూ, భీష్ముని పర్యవేక్షణలో విదురుని బుద్ధి బలం తోడు చేసుకొని పరిపాలన సాగిస్తూ ప్రజాభిప్రాయాన్ని చూరగొన్నాడు. తన వినయ వివేకముల ద్వారా పెద్దల అభిమానాన్ని, ధర్మ కర్మల ద్వారా దేవతానుగ్రహాన్ని పొందగలిగాడు.

సుఖంగా కాలం గడుస్తున్న ఆ రోజుల్లో ఒకనాడు పాండురాజు వినోదం కొఱకు వేటకు బయలుదేరి తన రాజ్యభారాన్ని ధృతరాష్ట్ర, విదురుల కప్పగించి తన భార్యలైన కుంతీ, మాద్రులతో అడవికి వెళ్ళాడు.

అరణ్యంలో వేడుకకై మృగరూపంతో విహరించే ముని దంపతులను నిజమైన మృగములేయని భావించి, సంహరించి, ఆ మునిచే శాపగ్రస్తుడై, రాజ్య భోగములను రోసి, తపోవృత్తితో అచటి మునులతో గూడి శతశృంగంపై నివసింపసాగాడు.

సంతానం లేకుండా మరణించడం ఇష్టంలేని పాండురాజు, కుంతికి చిన్నతనంలో దూర్వాసుడు ఉపదేశించిన మంత్ర ప్రభావంతో తనను పుత్రవంతుని చేయమని కోరాడు. భర్త ఆదేశం మేరకు కుంతి, యమ, వాయు, దేవేంద్రుల అంశలతో ధర్మజ, భీమ, అర్జునులను పొందింది. ఆ మంత్ర శక్తితోనే మాద్రి, భర్త నియోగాన్ని అనుసరించి అశ్వినీ దేవతల అంశతో నకుల, సహదేవులకు జన్మనిచ్చింది.

ముని శాపగ్రస్తుడైన పాండురాజు విధి వశమున ప్రకృతి పరవశుడై మాద్రి సమాగమంతో మృతి చెందాడు. మాద్రి ఆతనితో సహగమనం చేసింది. మునుల సహాయంతో బిడ్డలను వెంట బెట్టుకొని కుంతి హస్తినాపురం చేరింది.

ధృతరాష్ట్రునికి గాంధారి యందు దుర్యోధనాదులైన నూరుగురు కొడుకులు, దుస్సల అనే కుమార్తె కలిగారు. భీష్ముడు చిన్నతనంలో వీరందరికి విద్యాబుద్ధులు నేర్పటానికి కృపాచార్యుని నియమించాడు. శస్త్రాస్త్రవిద్యలు ప్రసాదించటానికి ద్రోణాచార్యుల వారిని వినియోగించాడు.

ఆట, పాటలలోను, చదువు, సాములలోను చురుకుగా పాల్గొంటూ, పోటీలన్నింటిలో విజేతలవుతున్న పాండవులను చూచి ధార్తరాష్ట్రులు ఈర్ష్యాళువులై శత్రుత్వాన్ని పెంచుకొన్నారు. (ఈ వ్యక్తిగత ద్వేషమే "చిలికి చిలికి గాలివాన అయినట్లు" తర్వాత జరిగిన ప్రపంచ యుద్ధానికి కారణమయ్యింది.)

దుర్జన సాంగత్యం

అసలే కోతి కల్లు త్రాగింది. నిప్పులు త్రొక్కింది. గంతులు వేసింది. అన్నట్లు దుర్యోధనుడు, దుశ్శాసన, శకుని, కర్ణులతో గూడి దుష్ట చతుష్టయంగా పేర్కొనబడుతూ వంశ వినాశనానికి హేతువులైన దురాగతాలెన్నో ఆచరించాడు.

సజ్జన సంసర్గ పవిత్ర చరిత్రుడైన యుధిష్ఠిరునకు పెద్దలందరి ఆమోదంతో యువరాజ పట్టాభిషేకం జరిగింది. ఆతడు ప్రజాహిత కార్యక్రమములలో పాల్గొంటూ, జనస్తుతి పాత్రుడయ్యాడు. గుణవంతులు, బలవంతులు అయిన పాండవుల యెడ ప్రజలు అభిమానంతో ఉండటం సహించలేని దుర్యోధనుడు తన మనోవ్యథ తండ్రికి జెప్పి, ధృతరాష్ట్రుని అనుమతితో పాండవులను వారణావతానికి పంపించే ప్రయత్నం చేశాడు. (బిడ్డల సంతృప్తికై వారి దుర్మార్గాలను ఆమోదించి ప్రోత్సహించే తండ్రులకు తుదకు కలిగే అనర్థమేమిటో ఈ ధృతరాష్ట్రుని చరిత్ర చాటి చెప్తుంది.)

అక్కడ లక్క యిల్లు కట్టించి, అందులో ఉంటున్న కుంతిని, పాండవులను సమూలంగా దహించి, వారి పీడ విరగడ చేసుకొందామని భావించాడు. ఈ రహస్యం విదురుని ద్వారా ముందుగానే తెలుసుకొన్న పాండవులు భూమార్గం ద్వారా బయటపడి, ఆపద తప్పించుకొని తమను తాము కాపాడుకో గలిగారు. హిడింబ వనంలో భీముడు తమను చంప వచ్చిన హిడింబాసురుని చంపి, తన్ను కోరుకొన్న హిడింబను స్వీకరించాడు. వారి పుత్రుడే ఘటోత్కచుడు.



అక్కడ నుండి పాండవులు ఏకచక్రపురం చేరారు. తల్లి అనుమతితో భీముడా ఊరివారిని బకాసురుని బారి నుండి తప్పించి కాపాడాడు. మత్స్య యంత్రాన్ని ఛేదించి అర్జునుడు తెచ్చిన ద్రౌపతిని తల్లిమాట ననుసరించి పాండవులైదుగురు వివాహమాడటానికి నిశ్చయించుకొన్నారు. వ్యాసమహర్షి వలన పంచేంద్రియోపాఖ్యానం విన్న ద్రుపదుడు సత్యాన్ని గ్రహించి ఆ ముని ఆదేశాన్ని పాటించి అయోనిజయైన ద్రౌపతిని వరుసగా పాండవులైదుగురికి ఇచ్చి వివాహం చేశాడు.

పాండవులు సజీవులై ఉన్నారని తెలిసి భీష్మాదులు సంతోషించారు. ధృతరాష్ట్రుడు వారిని (విదురుని ద్వారా) పిలిపించి నా బిడ్డలు నామాట విననివారు కావున మీరే రాజ్య భాగమును గైకొని, వేరెచ్చటికైనా పోయి నివసించండని ఆదేశించాడు. పాండవులు కష్టపడి ఇంద్రప్రస్థ పురాన్ని నిర్మించుకొని, ఊసర క్షేత్రాలను సస్యశ్యామలంగా చేసి, జనహితంగా రాజ్యం చేస్తూ, దిగ్విజయం సాధించి, రాజసూయ యాగం ఎంతో వైభవంగా నిర్వహించారు. ఎందరో రాజులు వచ్చి కానుకలర్పించారు. ధర్మజుని చక్రవర్తిగా అంగీకరించారు. కప్పములు చెల్లించారు. అది చూచి మిత్రులు సంతోషించారు, శత్రువులు అసూయ పడ్డారు.

ఆ సందర్భంగా జరిగిన సభలో అర్ఘ్యమునకు అర్హుడెవ్వడని అడిగిన ధర్మరాజునకు భీష్ముడు అచ్యుతుని అర్చించుమని ఉపదేశించాడు. ధర్మరాజు కృష్ణుని పూజించాడు. అది చూచి సహించని శిశుపాలుడు పరుషంగా మాట్లాడుతూ ధర్మజుని, భీష్ముని, కృష్ణుని నిందించి తన పరివారంతో సహా సభాభవనం విడిచి వెళ్ళిపోయాడు.

ధర్మరాజు అతని వెంట వెళ్ళి బ్రతిమాలుచు "సత్పురుషులకు వాక్పారుష్యము తగదని, విషము కంటే, అగ్ని కంటే అది భయంకరమైనదని" ప్రబోధించాడు. తమోహరుడై త్రిలోక పూజ్యుడైన దామోదరుని తాను పూజించుటలో గల ఔచిత్యమును వివరించుచున్న ధర్మజుని ఉద్దేశించి మాట్లాడుతూ భీష్ముడు "దుర్నయ పరుడైన శిశుపాలుని అల్పజ్ఞత్వమును నిరూపించాడు. రాగ ద్వేషములచే కప్పబడిన మనస్సు గలవాడు, కొద్దిపాటి రాజ్య సంపద చేతనే కళ్ళు మూసుకు పోయినవాడు అకారణంగా పెద్దలతో తగాదాలాడే స్వభావం గలవాడు అయిన ఈ శిశుపాలునికి ధర్మ స్వరూపమే తెలియదని నిర్ణయించాడు. ఇంక అతని నుద్దేశించి పలుకుచు "మూఢుడవైన

ఓ శిశుపాలా ! ఉత్తమ జ్ఞానవృద్ధుడు, అమిత విక్రమ సమృద్ధుడు" అయిన మురారియే ఈ అర్ఘ్యమునకు అర్హుడు. ఈ జగదాధారుడు మాకేకాదు, ముల్లోకముల వారికి సదా ఆరాధ్యుడే. అంతేకాదు ఇందులో వృద్ధు లెంతమంది ఉన్నా వారందరి కంటె గుణ వృద్ధుడని ఈ త్రివిక్రముని పూజించటం జరిగింది. ఈ లోకంలో ఇంకెవరికైనా పూజ జరిగితే వారి మటుకే సంతోషపడతారు. అచ్యుతుని పూజించటం వలన ముజ్జగములు పూజింపబడి పుణ్య సమృద్ధితో తృప్తి పొందుతాయి.

పూజితుల తృప్తులగుదురు, భూజను లొరు, అచ్యుతుండు పూజితుడగుడుం
దేజమున జగత్త్రితయము, బూజితమై వృద్ధిపొందు బుణ్య సమృద్ధిన్(స.భా2/28వ)

సర్వాత్ముడు, సర్వభూతేశ్వరుడు, సర్వవంద్యుడు అయిన కృష్ణుని యోగులు దర్శించినట్లు నీవు తెలిసికొనలేవు. ఆతడు చరాచరమైన ఈ సకల ప్రపంచానికి ఆధార భూతుడైన చైతన్య స్వరూపుడని చెప్పాడు.

శిశుపాలుడు వీరెవ్వరి మాటలు వినకుండా కృష్ణుని నిందిస్తూనే ఉన్నాడు. అతని తల్లికిచ్చిన మాట ప్రకారం నూరు తప్పులు పూర్తికాగానే దనుజాంతకుడైన కృష్ణుని సుదర్శన చక్రం ఆ రాజ లోకమంతా ఆశ్చర్యంతో చూస్తూ ఉండగానే అతని శిరస్సు ఖండించింది. శిశుపాలుని శరీరం నుండి వెలువడిన తేజం ఆకాశంలో వెలుగుతూ వచ్చి పరమేశ్వరుడైన కృష్ణునిలో లీనమయ్యింది. (ఆశ్రితులు, విరోధులు అనే భేదం లేకుండా ప్రాణులన్నింటికి ఆతడే శరణ్యుడనే సంగతి ఆ సందర్భంలో నిరూపింపబడింది.)

యజ్ఞ సంరక్షకుడైన కృష్ణుని పర్యవేక్షణలో రాజసూయం నిర్విఘ్నంగా పరిసమాప్తమై సజ్జనులకు ఆనందాన్ని, ధార్తరాష్ట్రులకు అసహనాన్ని కలిగించింది. పాండవుల వైభవాన్ని చూచి ఓర్వలేని దుర్యోధనుడు, శకునితో దురాలోచన చేసి ధృతరాష్ట్రుని యనుమతితో వారిని రప్పించి, మాయాద్యూతంలో ఓడించి, వారి సమక్షంలోనే ద్రౌపతిని పరాభవించాలని ప్రయత్నించాడు. ఆ కష్ట సమయంలో సభలోని వారెవ్వరు ధర్మమును ఉపదేశించి ఈ ఆకతాయుల నుండి తనను రక్షింపజాలరని తెలుసుకొని, పాండవ ధర్మ పత్నియైన ద్రౌపతి "భయార్తయై, ఆర్తజన శరణ్యుడైన, జగన్నాధు జనార్దనుం దలచుకొని" ఆతని దయచే ఆపదపాలు కాకుండ



కాపాడబడింది. (ఆ జగదీశ్వరుడు సర్వ భూతాంతరాత్ముడు, విశ్వరూపుడు అనటానికి ఇది కూడా ఒక నిదర్శనమే)

దుర్యోధన, దుశ్శాసనుల విపరీత ప్రవర్తనకు తగినట్లు యుద్ధంలో తొడలు విరుగగొట్టి, రొమ్ముపగిల్చి రక్తం త్రాగి ప్రతీకారం తీర్చుకొంటానని భీముడు భీకరమైన ప్రతిజ్ఞ చేశాడు. అప్పుడు ఎన్నో అపశకునములు కనపడ్డాయి. అంతా హాహాకారాలు చేశారు. ఆ సంరంభమును విని కారణము తెలుసుకొన్న ధృతరాష్ట్రుడు ద్రౌపతిని రావించి ఆమెకు వరములు ప్రసాదించి, ధర్మతనయుని, అతని తమ్ముళ్ళను వారి వారి ఆయుధములతో సహా దాస్యము నుండి విముక్తులయ్యేలా చేసి వారి రాజ్యం వారికిచ్చి పంపించాడు. ఇంతలో ఆ దుష్ట చతుష్టయం "మనమింత కష్టపడి సంపాదించిన సంపద సమస్తం ఈ ముదుసలి ఒక్క క్షణంలో పోగొట్టాడు. దెబ్బతిన్న త్రాచువలె పాండవులు మనపై కక్ష వహిస్తారు. ఇలా జరగటానికి వీల్లేదు. ఇది చాలా ప్రమాదమని ఆలోచించి, ధృతరాష్ట్రునికి నచ్చచెప్పి, పాండవులు ఇంద్రప్రస్థపురం చేరక ముందే వారిని రావించి బలంతో ఎలాగూ జయించలేము కనుక తిరిగి జూదంలో ఓడించాలని పట్టు పట్టారు. ధృతరాష్ట్రుని దండుకు సమ్మతించి విదురుని పంపించాడు. పెదతండ్రి మాట మన్నించి వారు వచ్చారు. ఈసారి జూదంలో ఓడిపోయిన వారు 12 ఏండ్లు అరణ్యవాసము, ఒక్క ఏడు అజ్ఞాతవాసము చేయాలని నియమం చేశారు.

వ్యాస మహర్షి "రాబోయే కాలంలో నీ వలన ఘోర యుద్ధం జరుగబోతోంద"ని చెప్పిన నాటి నుండి ధర్మరాజు తన వలన ఆ ప్రమాదం జరగకుండా ఉండేందుకై ఎవరేమి చెప్పినా చేస్తానని, ఎదురు మాట్లాడనని తమ్ముల ఎదుట ప్రతిజ్ఞ చేసినవాడు కావటం చేత ఈ సారికూడా జూదమాడమంటే "కాదు, కూడద"ని అడ్డు చెప్పకుండా జూదమాడాడు. విషయం తెలిసిన తమ్ములు అతనిని అనుసరించారు.

శకుని మాయ వలన అనుద్యూత పరాజితులైన పాండవులు నియమం ప్రకారం ద్రౌపతితో సహా అరణ్య వాసానికి బయల్దేరారు.

పౌరులు వెంటరాగా ధర్మరాజు వారికి నచ్చచెప్పి పంపించాడు. ధర్మాభిమానులైన విప్రులు కొందరు ఎంతగా వారించినా వినకుండా ధర్మరాజును అనుసరించి అడవులకు

వెళ్ళారు. వారందరి పోషణ నిమిత్తమై ధర్మరాజు అన్నదాతయైన సూర్యుని ప్రార్థించి అక్షయ పాత్ర సంపాదించాడు. అది విని ఉక్రోషంతో దుర్యోధనాదులు దుర్వాసునికి లేనిపోని మాటలు చెప్పి ప్రేరేపించి, పాండవుల నవమానింప పంపించారు.

అక్షయ పాత్ర ఆనాటికింక ఆహారం ప్రసాదింపదన్న సమయంలో ఆ మహర్షి శిష్య గణంతో వచ్చి భోజనానికి ఏర్పాటు చేయమన్నాడు. ఏం చేయటానికి పాలుపోని ఆపత్కర పరిస్థితులలో వారి మొఱలాలించి ఆశ్రిత సంరక్షకుడైన శ్రీకృష్ణ పరమాత్మ వచ్చి ఆ పాత్ర నుండి ఒక్క మెతుకు స్పృశించి, వెతికి తీసుకొని, తిని తృప్తి చెందడం ద్వారా మహర్షికి, శిష్యులకు తృప్తి కలుగజేశాడు. అన్నమును ఇచ్చేవాడు, తినేవాడు, అన్నము కూడ అతడే అను సత్యమును నిరూపించాడు. ఈ విధంగా కూడా చక్కగా కృష్ణుని సర్వభూత మయత్వం లోకవిదితమై నుతికెక్కింది. పాండవులు అరణ్యంలోఉండగా తన వైభవాన్ని ప్రకటించటానికి దుర్యోధనుడు ఘోషయాత్రకై పరివారంతో వచ్చి గంధర్వపతి చిత్రరధునిచే బంధింపబడినప్పుడు ఔచిత్యం తెలిసిన ధర్మరాజు తమ్ములచే ఆతనిని విడిపించాడు. (చెరపకురా చెడేవు అన్నది ఇందులోని నీతి)

ధర్మతత్పరులగు పాండవులను పలుకరించి, వారికి ధైర్యం చెప్పటానికి మార్కండేయాది మహర్షులెందరో వచ్చి, మహాత్ములైన వారి పుణ్య కథలు చెప్పి వారిని ఊరడించారు. వ్యాసుని ఉపదేశాన్ని అనుసరించి, ధర్మజుని అనుమతితో సంయమధనుడైన అర్జునుడు శివుని గూర్చి తపస్సు చేసి, ఆతని అనుగ్రహంతో అనన్య సామాన్యమైన పాశుపతాస్త్రాన్ని పొందాడు. తర్వాత పాండవులు ధౌమ్యునితో కూడి పుణ్య తీర్థయాత్రలు చేస్తూ అరణ్య వాస సమయాన్ని సద్వినియోగపరచుకొన్నారు. మహర్షులు చెప్పిన వివిధ ధర్మములు విని మననం చేస్తూ సర్వభూత హితాన్ని ఆత్మ సంయమనాన్ని పెంపొందించుకొన్నారు.

దుర్యోధనాదుల చెల్లెలు దుస్సల. ఆమె భర్త సైంధవుడు. పాండవులు అరణ్యవాసంలో ఉండగా ఒకనాడు పతులు వేటకై అడవికి వెళ్ళగా పర్ణశాలలో ఒంటరిగా ఉన్న ద్రౌపతిని జూచి దుర్భాషలాడి, నీకిది తగదని ఎంత వారించినా వినకుండా వావి వరుసలు మరచి దుర్బుద్ధితో ఆమెను బలవంతంగా తన రథంపై ఎక్కించుకొని వెళ్ళిపోతున్నాడని తెలిసి, భీమార్జునులు అతనిని ఎదిరించి, బంధించి తీసుకొని వచ్చారు. ధర్మజ్ఞుడైన ధర్మజుడతనికి ఎట్టి అపకారం తలపెట్టక బుద్ధిచెప్పి, దయతో విడిచి పెట్టాడు.



ఆశ్రమ వాసుల సంరక్షణకై అడవిలో తిరుగుచు, తన తమ్ములు పిపాసార్తులై వచ్చి, యక్షుని మాట ధిక్కరించి అచటి సరస్సులో నీరు త్రాగి మూర్ఛితులైన సందర్భంలో ధర్మరాజు యక్షుని ప్రశ్నలకు సరియైన సమాధానాలు చెప్పి వారిని బ్రతికించుకొన్నాడు. సత్య జ్ఞాన సమన్వితములైన ఆ యక్ష ప్రశ్నలు మానవాళికి అవశ్య పఠనీయములు. ఆ యక్షుడే ధర్మదేవతగా కీర్తింపబడు యమధర్మరాజు. ఆతని అనుగ్రహంతో ధర్మరాజు తమ అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా జరిగేందుకు తగిన వరం పొందాడు.

పాండవులు అరణ్యవాసం పూర్తి చేసుకొని, అజ్ఞాతవాసం చేయటానికి ముందుగా ధౌమ్యుని వద్ద సెలవు తీసుకొని మత్స్య దేశము అన్నివిధముల సుసంపన్నమైనదని. ఆ రాజు ధర్మాత్ముడైన విరటుడు సేవింపదగిన వాడని నిశ్చయించుకొని మారు వేషములతో, పేర్లు మార్చుకొని ఆతని కొలువులో ప్రవేశించారు.

పరస్త్రీ కాముకత్వంతో కళ్ళు కప్పుకుపోయిన కీచకుడు ద్రౌపతిని పరాభవించడంతో భీముడు కీచకుని, వాని నూరుగురు తమ్ములను చంపి ప్రతీకారం తీర్చుకొన్నాడు. దాంతో పాండవులు విరాటుని కొల్వులో ఉన్నారేమో అన్న సందేహం కలిగి కౌరవులు గోగ్రహణానికి ప్రణాళిక రచించారు. అందులో విరాటురాజుకు విరోధి, దుర్యోధనునకు ఆశ్రితుడు అయిన సుశర్మ దక్షిణ గోగ్రహణం చేయాలని, అదే సమయంలో కురుసేన ఉత్తర గోగ్రహణానికి పూనుకోవాలని, అప్పుడు గాని కృతజ్ఞతాభావానికి పెట్టింది పేరుగా ప్రసిద్ధికెక్కిన పాండవులు బయటపడరని, ఆ విధంగా వారికి నియమభంగం చేసి, తిరిగి వారిని అరణ్యవాస అజ్ఞాతవాసములకు పంపించి తాము సుఖంగా రాజ్యభోగము లనుభవించవచ్చని సంకల్పించారు.

దక్షిణ గోగ్రహణాన్ని ఎదుర్కొనేందుకు ఉత్తరకుమారుడు తప్ప తక్కిన వీరులంతా వెళ్ళగా, ధర్మజ, భీమ, నకుల, సహదేవులు కూడా తమ కర్తవ్యంగా యుద్ధరంగానికి వెళ్ళి, వైరివర్గమును జయించి, రాజ్యగౌరవాన్ని నిలబెట్టారు. ఇంతలో ఉత్తర గోగ్రహణ వార్త విన్న ఉత్తరుడు సారథి ఒక్కడు లేడుగాని, ఉంటేనా కురుసేనను ఇట్టే జయిస్తానని ఆడవారి ముందు ప్రగల్భములు పలకటం విన్న (బృహన్నల) అర్జునుడు, తాను రథ సారథియై ఆతని వెంట రణరంగానికి వెళ్ళాడు. కురుసేనను జూచి గడగడవణుకుచు భయపడుతున్న ఉత్తరునకు ధైర్యం చెప్పి, తననుతాను

పరిచయం చేసుకొని, జమ్మిచెట్టుపై కట్టిపెట్టిన ఆయుధముల నుండి గాండీవాన్ని గ్రహించి, కురుసేనను ఎదుర్కొని, సమ్మోహనాస్త్రంతో మూర్ఛిలజేశాడు. గోవులను మరలించుకొని వచ్చాడు.

అజ్ఞాతవాస భంగమును గూర్చి చేసిన చర్చలో భీష్ముడు అధిక మాసములతో సహా ఆ గడవు ఇప్పటికెన్నడో ముగిసిపోయిందని వివరించాడు. నిరాశోపహతుడైన దుర్యోధనుడు పరాభవంపైకొనగా హస్తినా పట్టణం చేరాడు. ఇంత జరిగినా బుద్ధి లేక కురుక్షేత్ర యుద్ధానికి సంసిద్ధుడవటమే దుర్యోధనుని మూర్ఖతకు తార్కాణము.

విరాటరాజు పాండవులను తెలుసుకొని క్షమాభిక్ష వేడుకొని, పెద్దల అనుమతితో ఉత్తరను అర్జునుని తనయుడైన అభిమన్యునకిచ్చి వివాహం చేశాడు.

పాండవులు బంధుమిత్రులతో గూడి ఉపప్లావ్యమున నుండి, కురురాజు సన్నిధికి తమ తండ్రి భాగము తమ కిమ్మని ద్రుపద పురోహితుని ద్వారా చెప్పి పంపించారు. సంధి ప్రయత్నము సాగనివ్వలేదు. వారు సరియైన సమాధానము చెప్పలేదు. ఇంతలో ఇరు పక్షములవారు బంధు, మిత్రులను, ఇష్టులను, అనుయాయులను సమకూర్చుకొనే ప్రయత్నం చేశారు. అందులో భాగంగానే దుర్యోధనుడు, అర్జునుడు కూడా అనుకోకుండా ఒకే సమయంలో ద్వారకకు చేరారు. కృష్ణ మందిరంలో ముందుగా ప్రవేశించిన దుర్యోధనుడు నిద్రిస్తున్న కృష్ణునికి కాళ్ళకడ నున్న ఆసనంపై కూర్చుని, అంతలో ఆలస్యాన్ని భరించలేక అసహనంగా రారాజుననే దురభిమానంతో తనకది తగదని తలవైపున నున్న పీఠంపై ఆసీనుడయ్యాడు. అర్జునుడు ప్రవేశించి, కృష్ణ పరమాత్మకు భక్తితో నమస్కరించి వినయంతో పదముల చెంతగల పీటపై కూర్చుని అతడు మేల్కొనేంత వరకు వేచి చూస్తున్నాడు.

కృష్ణుడు నిద్ర లేచి, వారిరువురిని పలుకరించి, వచ్చిన పని సుయోధనుడు చెప్పగా విని, తనతో సమానమైన బలపరాక్రమములు గల తన సైన్యమును 10 వేల మందిని (నారాయణ సేన) ఒక పక్షముగా తానొక్కని ఒక పక్షముగా విభజించి, తాను ఆయుధము ధరించి యుద్ధము చేయనని వివరించి, ఈ రెంటిలో మీకేది ఇష్టమో అది వారు గ్రహింపుడని చెప్పి కోరుకొనుటలో మొదటి అవకాశము అస్వతంత్రుడు అన్నచాటు తమ్ముడు అయిన అర్జునునకు కల్పించాడు.



ధర్మజ్ఞుడైన అర్జునుడు విశ్వేశ్వరుడైన కృష్ణుని అనుగ్రహం కోరుకొన్నాడు. ఆతని ఆత్మీయత, అనురాగములు చాలునన్నాడు. తన రథసారథియై ఉండమని ప్రార్థించాడు. కృష్ణుడు సంతోషంతో అంగీకరించాడు. దుర్యోధనుడు భౌతికమైన సైన్యాన్నే కోరుకొన్నాడేగాని అంతర్దృష్టితో కృష్ణుని పరమాత్మ తత్త్వాన్ని గ్రహింపలేక పోయాడు. పైపెచ్చు కృష్ణుని వరించిన అర్జునుని పిచ్చివానిగా పరిగణించాడు. కృష్ణుని ఉనికి నిరర్థకమని సంభావించాడు. ఇలా జరిగినందుకు లోలోపల చాలా సంతోషించాడు. [లోకము లన్నింటికి బలము నిచ్చు నిఖిల చైతన్య స్వరూపుని కృష్ణుని నిజముగా గుర్తింపజాలని దుర్యోధనుడు ఆతని విరాడ్రూపమును భావింపలేక పోయాడు. ఉన్న బలగమేకాక కోరితెచ్చుకొన్న బలగములు సహితం ఆ భువనాధినాథుడైన కృష్ణుని సంకల్ప బలం ముందు నిలువ లేక పోయాయి. ఆ జగదీశ్వరుని ఆశ్రయించిన వారు సంరక్షింపబడ్డారు. దైవబలమే నిజమైన బలముకాని, ఇతర బలములు బలములు కావు. వానికి శాశ్వతత్వం లేదు. ఈ పరమార్థ మీ సందర్భమునందు సునిపుణముగా ప్రతిపాదింపబడింది.]

తర్వాత, కౌరవుల వద్ద నుండి సంజయుడు రాయబారిగా వచ్చి దుర్యోధనుడు దుశ్శీలంతో రాజ్యభాగ మీయక పోయినా, పాండవులు యుద్ధం చేయకుండా ఉండేందుకు తగిన విధంగా మాట్లాడాడు. అతని వాక్చమత్కృతి గమనించిన పాండవులు కృష్ణుని సమక్షంలో "వారు తమకు రాజ్యభాగాన్ని ఇవ్వటమో, యుద్ధమునకు సంసిద్ధమవటమో నిశ్చయించుకొమ్మని కౌరవులకు సందేశం పంపించారు. సంజయుడు హస్తినాపురానికి వచ్చి ధృతరాష్ట్రునకు తనరాక తెలియజేసి మరునాటి సభలో పాండవుల యభిప్రాయాన్ని వివరిస్తానని చెప్పి సెలవు తీసుకొని వెళ్ళి పోయాడు.

ధృతరాష్ట్రునికి ఆ రాత్రి నిద్రపట్టలేదు. మనసు వ్యాకులత చెందింది. అప్పుడు ప్రతీహారిచే విదురుని పిలిపించి నీతి వాక్యములు చెప్పమని కోరాడు. ఆ విదురుని నీతి లోకంలో అందరికి విని, కంఠస్థం చేసి, ఆచరింపదగిన ముఖ్య ఘట్టంగా ప్రసిద్ధికెక్కింది.

సంజయుడు ఆ మరునాడు సభలో పాండవుల ఉద్దేశాన్ని వివరించి, కృష్ణుని సందేశాన్ని వినిపించాడు. వారి బల వైభవములు, నైతిక గుణ సంపద ధర్మతత్పరత వర్ణించి, వారితో సంధి చేసుకొనుట ఉభయులకు క్షేమదాయకమని చెప్పాడు. అది విన్న ధృతరాష్ట్రుడు భీష్మాదులతో బాటు తానుకూడా దుర్యోధనునకు పాండవులతో

సంధి చేసుకోమని బోధించాడు. అప్పుడా దుర్యోధనుడు తండ్రికి తన పక్షమున గల వారి బల పరాక్రమములు చెప్పి భీష్మాది కురువృద్ధుల, గురువృద్ధుల మాట పెడచెవిని బెట్టాడు. వ్యాసుడా సమయంలో ప్రత్యక్షమై పాండవుల అమేయ బల పరాక్రమములు వాసుదేవుని సర్వజ్ఞత్వము నిరూపించి, వారితో సంధి చేయుటయే యుక్తమని చెప్పి అంతర్హితుడయ్యాడు.

పాండవులు తమలో తాము చర్చించుకొని, కృష్ణుని కురు సభకు రాయబారిగా పంపి, సంధికై యత్నించినచో ప్రజా క్షయము లేకుండ చేయవచ్చునని సంభావించి, వాసు దేవుని ప్రార్థించారు. వారు తమ కెంతటి యపకారము చేసిన వారైనప్పటికి జ్ఞాతులు కావున వారితో సంధిగావించుకొని, కూడి, మనుటయే ధర్మమని సంకల్పించి, తమ తండ్రిపాలు సగభాగం ఇవ్వక పోయినా చివరకు తమ ఐదుగురికి ఐదు ఊళ్ళు ఇచ్చినా చాలని కృష్ణునితో చెప్పి పంపించారు.

కృష్ణుడప్పుడు కరిపురమునకు చేరి, కురువృద్ధులు, గురువృద్ధులు, నారదాది దివ్యమునులు, పారాశర్యాది మహర్షులు గల ఆ కురు సభలో పాండవుల యభిప్రాయాన్ని వివరించి, కౌరవులకు హితవు చెప్పి, కర్తవ్యాన్ని బోధించి సంధికై యత్నించాడు. భీష్మ, ద్రోణ, ధృతరాష్ట్ర, విదురులు కూడా తగవు చెప్పారు. అది వినక దుర్యోధనుడు సభ నుండి వెడలిపోయి, తన వారితోకూడి కృష్ణుని బంధించి, పాండవులను నిస్సహాయులను చేయాలని సంకల్పించాడు. అందుకు తగిన సన్నాహాలు సాగించాడు. ఆ విషయం గమనించిన సాత్యకి కృష్ణునికి సూచించాడు. నదురు బెదురు లేక కృష్ణుడు చెప్పదలచు కొన్నది చెప్పి, కౌరవులకు కనులు మిరిమిట్లు గొలిపేలాగా తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. వారంతా నిశ్చేష్టులై నివ్వెరపోయారు. మునులు, మహర్షులు చూచి జయ జయ ధ్వానములు చేశారు. భీష్మాది సజ్జన వర్గమునకు దివ్యదృష్టి నొసంగి వారిని సంతుష్టులను చేశాడు. ధృతరాష్ట్రుడు ఈ సంభ్రమమంతా విని తనకూ ఆ భాగ్యమును కల్పింపమని ప్రార్థించాడు. కృష్ణుడాతనికి దివ్య నేత్రములు ప్రసాదించి తన విశ్వరూపమును ప్రదర్శించాడు. నిన్ను చూచిన ఈ కనులతో ఈ దుష్ట ప్రపంచమును చూడలేను ఈ నేత్రములు ఉపసంహరింపుమని ధృతరాష్ట్రుడు ప్రార్థించాడు. కృష్ణుడు ఆతని కోరిక మన్నించాడు. నారదాది మహామునులు యోగిజనైక వేద్యమైన కృష్ణుని అనంతత్వమును వీక్షించి, అమందానంద కందళిత హృదయారవిందులయ్యారు. (వారు విశ్వరూపమును



సందర్శించగలరే కాని ఇతరులకు చూపించలేరు. అది ఒక కృష్ణునికే సాధ్యం. అందుకే అతడు యోగీశ్వరేశ్వరుడయ్యాడు.) ఆ సమయంలో దేవ దుందుభులు మ్రోగాయి. పుష్పవృష్టి కురిసింది. ఆ విధముగ విశ్వేశ్వరుడు విశ్వవంద్యుడు అయిన కృష్ణుడు తనకెవ్వరు ఎట్టి అపకారమును చేయలేరని నిరూపించి కురుసభనుండి వెడలివచ్చి జరిగినదంతయు కుంతికి నివేదించి ఆమె సందేశమును విని, తిరిగి ఉపప్లావ్యమునకు చేరి కర్తవ్యమును నిర్దేశించెను.

## విశ్వరూప దర్శనం - విభూతియోగం

ఈ విధంగా సంధి ప్రయత్నములన్నీ నిఫలములు కాగా కృష్ణుడు పాండవులను యుద్ధమునకు సమాయత్త పరచాడు. ధర్మ క్షేత్రమగు కురుక్షేత్రమున ఉభయ సేనలు మోహరించి ఉండ, పార్థ సారథియై కృష్ణుడు రథమును సేనా మధ్యమున నిలిపాడు. కురుసేనలో వీరులగు భీష్మ, ద్రోణ, కృపా, అశ్వత్థామాదులను, తక్కిన బంధు, మిత్రులను చూచి మోహితుడై అర్జునుడు యుద్ధం చేయజాలనని నిరుత్సాహాన్ని పడ్డాడు. కృష్ణుడు ఉపనిషత్సారమైన గీతను బోధించి, ఆతని మోహమును పోగొట్టి, కర్తవ్య నిష్ఠుణి చేశాడు. అర్జునుడు ఈ యుద్ధంలో నిమిత్తమాత్రుడే అని నిరూపించి, సర్వం నిర్వహించేది తానేనని తెలియజెప్పి, స్మృతిని కలిగించి, ద్వంద్వముల యెడ సమబుద్ధి కలిగించు యోగమును ఉపదేశించి క్షేత్ర యుద్ధమును సాగించి అర్జునుని విజయుని చేశాడు.

భారత రణం ముగిసింది. ధర్మజుడు కృష్ణుని సహాయంతో కురు సామ్రాజ్యానికి ప్రభువై అశ్వమేధాది యజ్ఞములు నిర్వహించి భూరి దక్షిణలిచ్చి, భూ ప్రజలను సంతోషపరిచాడు. ధర్మ ప్రతిష్ఠ చేయదలచిన కృష్ణుణి సంకల్పం నెరవేరటానికి పాండవులు ఉపకరణములయ్యారు. అతడిచ్చిన శక్తి సామర్థ్యములు కృష్ణావతార పరిసమాప్తి కాగానే లుప్తమై పోయాయి.

(అర్జునుడు ద్వారవతి నుండి స్త్రీలతో వస్తూంటే సామాన్యులైన బోయవారు అడ్డగించినప్పుడు నిశ్చేష్టుడై నిలచియుండుటే అందుకు నిదర్శనం.)

శాంతి పంచకమునందలి ధర్మములనేకములు ప్రపంచ శాంతికి సూచకములైన, ఆత్మ నిగ్రహమును ప్రబోధించేవిగా ఉన్నాయి. నైతికములైన ఎన్నో విషయములు ప్రస్తావింపబడ్డాయి. శాంతి పర్వంలో, కృష్ణుడు పాండవులను వెంటపెట్టుకొని అంపశయ్యపైన ఉన్న భీష్మునివద్దకు చేరి, ఆయనచే వివిధ ధర్మములు వివరింపజేశాడు. శాస్త్రజ్ఞానంతో బాటు అనుభవం కూడా జోడింపబడినప్పుడే ఆ విషయమునకు అధిక ప్రాధాన్యం సిద్ధిస్తుందనేది ఇందులోని పరమార్థంగా కృష్ణుడు నిరూపించాడు. జగత్తులో సర్వమూ తానేనని తెలియజేశాడు.

అనేక రూపాలలో జగత్తు అంతటా నిండి ఉండిన భగవంతుడు అప్పుడే కాదు, ఇప్పుడు కూడా తన విశ్వరూపాన్ని వివిధ రకాలుగా ప్రదర్శిస్తూనే ఉన్నాడు. అది గుర్తించ గల శక్తి మనలో భక్తి, సాధనల ద్వారా పెంపొందించుకొనటం మన కర్తవ్యం. ఆ జ్ఞానం కలగటమే దైవానుగ్రహంగా భావించుదాం.



ప్ర. మీరు భారతం ద్వారా గ్రహించిన నీతి ఏమిటి ?

స. ఇతరుల ఐశ్వర్యాన్ని చూచి ఎప్పుడు దుఃఖపడ కూడదనీ, సత్పురుషులను ద్వేషించ కూడదనీ, స్త్రీలను పరాభవింప కూడదనీ, పరుల ద్రవ్యాన్ని అన్యాయంగా అపహరించ కూడదని.

"ఈ విషయం తెలుసుకొంటే భారత సారమంతా గుర్తించినట్లే."

— శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి
(స్వాతి మాస పత్రిక)

# మహాభారత మహోపదేశం

**రచన : తాడేపల్లి పతంజలి M. A.**

"నారాయణం నమస్కృత్య - నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం - తతో జయ ముదీరయేత్"

ప్రపంచంలో మనుగడకు అవసరమైన ధర్మార్థ కామమోక్షాలనే చతుర్విధ పురుషార్థాల సుస్వరూప దుస్స్వరూపాలను ప్రవచించి, అనితర సాధ్యమైన గ్రంథ ప్రతిష్ఠ పొందిన ప్రమాణ గ్రంథము మహాభారతము.

"ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ
యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచిత్"

"ఈ గ్రంథంలో ఉన్న విషయములన్ని చోట్లా ఉన్నవి. ఈ గ్రంథంలో లేనిది యింకొకచోట లేదు" అని పేరు వడసిన ప్రామాణిక గ్రంథము మహాభారతము. దీనిలో ఉన్న ధర్మము ఇతర గ్రంథములలో లేకున్నను ఆచరించవలెనని, దీనిలో లేని ధర్మము ఇతర గ్రంథములలోనున్న దానిని ఆచరించినను, విడిచినను ప్రత్యవాయము లేదని శంకరులు పేర్కొనిరి. ఇంతటి మహోన్నత్యము గల భారతము నేటి సంఘానికి అందించే సందేశమేమిటో సంధానించే ప్రయత్నమే ఈ 'వ్యాస నివేదన'. పర్వానుక్రమముగా అనుగమించి సందేశ సందోహమును స్థాలీ పులాక న్యాయముగా స్థాపింప యత్నించెదను.

నేటి సమాజములో అత్యాచారాలు, హింసా విధానాలు, దోపిడీలు, దొంగతనాలు, హత్యలు, లంచగొండితనాలు, వినయ రాహిత్యాలు, బంధుప్రీతి, పదవీ వ్యామోహం, అధర్మ పరిపాలన - ఇది యది యననేల? మార్కండేయ మహర్షి అరణ్య పర్వంలో చెప్పిన కలియుగ విపరీత లక్షణాలలో కొన్ని యిప్పటికే మహా వృక్షాలుగా పరిణమించగా, మరికొన్ని చిగురులు వేస్తున్నాయి. మంచితనం ఏ మూలనో మినుకు మినుకుమంటూ కొండెక్కటానికి సిద్ధంగా ఉన్న ఈ సంక్షుభిత సమాజంలో భారతము ఒక చక్కటి మిత్రుడు, గురువు, బంధువు, ఆప్తుడు. "ధర్మ

తత్త్వజ్ఞులకది ధర్మశాస్త్రము. నీతి విచక్షణులకు నీతిశాస్త్రము. కవి వృషభులకు మహాకావ్యము. పౌరాణికులకు బహుపురాణసముచ్చయము" ఒక్క మాటలో చెప్పాలంటే విజ్ఞాన సర్వస్వము. అద్దంలో చూసి మొగం దిద్దుకొన్నట్లు, భారతాన్ని చదివి, ఏ సమయంలో ఏ రీతిగా ప్రవర్తించాలో నేర్చుకోవచ్చు.

## సత్యాన్ని మించింది లేదంటుంది భారతం

"నుతజల పూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత యొక బావిమేలు - మఱి బావులు నూఱిటి కంటె యొక్క స
త్క్రతువది మేలు తత్క్రతు శతంబున కంటె సుతుండు మేలు త
త్సుత శతకంబు కంటె యొక సూనృత వాక్యము మేలు చూడగన్"

[ఆదిపర్వం. చతుర్థా. 94 ప]

ఇది శకుంతల దుష్యంతునికి చేసిన ప్రబోధము మాత్రమే కాదు. సమస్త మానవాళికి భారతము నిరూపించిన సత్యప్రశస్తి. "సహస్ర అశ్వమేధాల కంటె" ఒక సత్యమైన వాక్కే గొప్పదని భారతం ప్రవచిస్తోంది.

ధర్మజుడు జూదానికి మారు మాట్లాడక తమ్ములతో సహా, రెండు పూర్లు రావటానికి కారణ మతని సత్యదీక్ష. ఇంద్రప్రస్థమున ఇరవైనాలుగు సంవత్సరాలు రాజ్య పరిపాలన సాగించిన తదుపరి శంకరుడు ధర్మజునికి కలలో కనిపించి, అతని మూలముగా ప్రజాక్షయమగునని చెప్పగా, తమ్ములతో ఆలోచించి ఇకపై పదునాలుగు సంవత్సరాలు ఎవ్వరేమి చెప్పిననూ తాను చేసెదనని, మానాభిమానాలు విడిచి ప్రవర్తింతుననియు ప్రతిజ్ఞ చేసెను. తమ్ములందరు కూడా అన్నగారి అడుగుజాడలలో నడిచెదమని ప్రతినలు బూనిరి. సత్యధర్మపాశ బద్ధులగుట వలననే అంతటి ద్రౌపదీ వస్త్రాపహరణ విషాద సందర్భంలోనూ మారుమాట్లాడక ధర్మజాదులు ఊరకుండిరి.

ఈ ధర్మరాజు సత్యప్రశస్తిలోనే మరొక సందియము లోకమున ఉన్నది. ద్రోణ పర్వములో ధర్మరాజు "అశ్వత్థామ హతఃకుఞ్జరః" అను అబద్ధమేలయాడెను ? ఇంతటి అసత్యవాది గల భారతము లోకానికి యిచ్చు సత్య సందేశమేమి ? దీనికి బ్రహ్మశ్రీ వేదమూర్తులు కీ॥శే॥ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారి సమాధానము:



"ఆ మాట ధర్మజుని నోటవిన్న ద్రోణుడు ధర్మజుని కుంజరమా ? నా కొడుకా ? అని అడుగలేడా ? వినరాని మాట విన్న చచ్చెదనన్న ప్రతిజ్ఞ కదియే చాలును గాక ! ధర్మజుడు "కుంజరః" అని మెల్లగానన్న దోషమునకు ముందు యమలోకము చూచెను. అంత మాత్రము నందు లేకపోయిన నరకము పూర్తిగానే యనుభవించ వలసి యుండు" అని కథా భాగమును బట్టి సారాంశము తోచుచున్నది."

(నాకు తోచినమాట :- పేజీలు 222, 223)

సత్యమునకు భారతమంతటి విలువ నిచ్చింది. ధర్మ నిష్ఠుడయిన ధర్మరాజులో కూడా ఇసుమంత దోషముండుట వలన ఫలిత మనుభవింపచేసింది భారతం. లోకములో 'సత్య హరిశ్చంద్ర' అని పేరు వచ్చెను గాని "సత్య ధర్మరాజు" అను పేరు రాకపోవుటకు యిదియే కారణము కానోపును.

కోరికల పరిమితమై సంతృప్తిని దూరం చేసుకొంటున్న నేటి సంఘ జీవులకు ఆది పర్వంలో యయాతి చేసిన ఉపదేశం శిరోధార్యం. "నెయ్యి మొదలైన ఆహుతులు వేసినకొద్దీ అగ్ని ప్రజ్వరిల్లుతుంది. అనుభవించే కొద్దీ కోరిక పెరుగు తుంటూనే ఉంటుంది. ఎంత ఐశ్వర్యమున్నా, లలనా లలాపులు లభించినా కోరికలు తృప్తి చెందవు. ఈ ఆశాపాశాన్ని తెంచుకోగలవాడే ధన్యుడు".

వినయం ప్రధానమని ఆపంచమవేద ప్రబోధం. శ్రీకృష్ణపరమాత్మ ఒండు రెండు చోట్ల ధర్మజునికి పాదాభివందనం చేసి, పెద్దలయెడ పిన్నలకు మన్ననావశ్యకత తెలియజేస్తాడు. (ఉదాహరణకు ద్రౌపది పరిణయ సందర్భం) దుర్యోధనుడు వినయ రాహిత్యంతో మైత్రేయ మహాముని చెప్పుచున్న మాటలు పట్టించుకోకుండా తొడలు చరుచుకున్నందుకు ఆ మహితాత్మునిచే ఊరు భంగ శాపమొందాడు. పెద్దలెదుట వినయంతో ప్రవర్తించాలి.

నేటి అధికార వర్గానికి పరిపాలనా విషయమై రెండు, మూడు పర్వాలలో సందేశాన్నిచ్చింది భారతం. ఉదాహరణకు సభాపర్వపు ఆరంభంలోనే నారదులవారు "నీకు తెలియదని కాదు" అంటూ పరిపాలన ఎలా సాగించాలో ధర్మజునికి వివరించాడు." కామ బుద్ధితో ధర్మార్థాలను వదులుకోకూడదు. ధనం దుర్వ్యసనాలవైపు మనస్సును పరుగెత్తిస్తుంది. దాన్ని నిరోధించాలి. విశ్వసనీయుని, విశుద్ధ వర్తనుని, నిర్వహణ దక్షుని, వినిర్మల మనస్విని మంత్రిగా చేయాలి. ఏదయినా తట్టుకోలేని సమస్యలు

వచ్చినప్పుడు ప్రధానులతోనే సంప్రదించాలి కాని, కనిపించిన వారందరిని అడుగరాదు. వెయ్యి మంది మూర్ఖులను ఆదరించడం ఎంత అజ్ఞానమో, ఒక్క విద్వాంసుని దూరం చేసుకోవడం అంత అవివేకం. నేరం చేసినవాడిని ఎన్నడూ విడిచి పెట్ట కూడదు. ఎందుకంటె వాడిమీద ఏ మాత్రం దయ చూపినా, మిగతా వారిలో దోష ప్రవర్తన బాగా పెరుగుతుంది. అందువలన నేరం చేసిన వాడికి సకాలంలో శిక్ష పడాలి." (సభా పర్వము ప్రథమా 26 నుండి 55 వరకు) ఈ విషయాలు నేటి కాలానికి కూడా అవశ్యాచరణీయాలని వేరే చెప్పనవసరం లేదు.

పాప కలహ కారణమైన జూదాన్ని గూర్చి అరణ్య పర్వంలో దమయంతి ఇలా వాపోయింది.

"ఎంత యోటు వడిన నంతియ జూదంబు - నందు దగులు జలము నతిశయిల్లు
నేమి సేయుదాన నిదియెగ్గునకు మూల - మని లతాంగి దుఃఖితాత్మయగుచు."

(అరణ్య. ద్వితీయా 63 ప)

ఎంత ఓడిపోతే అంత పట్టుదలను పెంచే జూదాన్ని భారతం చెవి నిల్లు గట్టు కొని నిషేధించింది. విన్నవాళ్ళు విన్నాణము ఉన్నవాళ్ళు.

నీడ మానవుని వెంట నడిచేటట్లు, బుద్ధి ధర్మమార్గాన నడవాలని భారతం ఎలుగెత్తి చాటుతోంది. (అరణ్య పర్వం). "ధర్మక్షేత్రే కురుక్షేత్రే-" అను శ్లోక పాదానికి ఒక రాణిగారు "క్షేత్రే క్షేత్రే ధర్మం కురు (ప్రతిచోటా ధర్మమును నిర్వ హించు) అని అవగతము చేసుకొన్నారట. ఇలా ప్రతిచోటా భారతం ధర్మ సందే శాన్ని ఇస్తూనే ఉంటుంది.

కీచకులు - కాదు - కీచకులకే పాఠాలు నేర్పే ప్రబుద్ధులున్న నేటి సమాజంలో విరాట పర్వంలోని ఈ సందేశం సంఘాతం. "గుణ శీలోత్కృష్టురాలిని కామ దృష్టితో వాంఛించే వాడి నెత్తిమీద మృత్యువు నృత్యం చేస్తూ ఉంటుంది" కీచకుడి పొట్ట చీల్చి, వాడి శిరస్సు అందులో దూర్చాడట భీముడు, పరస్త్రీ వ్యామోహము గల కాముకాధములకు ఇటువంటి శిక్షలు ఏనాటికైనా ఏదో రూపేణా తప్పవు. ఇది పంచమవేద ప్రవచనము.



భారతంలో మాటకు పట్టాభిషేకం చేసిన పర్వం ఉద్యోగ పర్వం. ఎక్కడ ఎలా పలకాలో, ఎంతమేర పలకాలో, ఏ మాట అనకూడదో తరచి తరచి పరిశీలిస్తే 1) ద్రుపద పురోహితుని రాయబారం 2) సంజయుని రాయబారం 3) కృష్ణ రాయ బారం - నేర్పిస్తాయి. వెనకా ముందు చూడకుండా, కించిత్తయినా ఆలోచించకుండా నిష్ఠూరోక్తు లాడాడు ద్రుపద పురోహితుడు.

అటూ, ఇటూ తేలనీకుండా - అంటే కర్ర విరగకుండా పాము చావకుండా - ఎలా మాట్లాడాలో సంజయ రాయబారం బోధిస్తుంది. అధికారుల నమ్మిన బంటులకు ఒక్కొక్కసారి సంజయునికి వచ్చిన పరిస్థితే రావచ్చు. అధికారి చెడ్డవాడయినా దుష్టుడన కూడదు. ఎదుటి వారిని కూడా దుష్టుడన కూడదు. కార్యం సానుకూలం చేయాలి. అప్పుడు సంజయ రాయబార ఘట్టం ప్రతివారు చదివి తీరాల్సిందే. 'మెత్తని పులి' ధర్మజుని చెంత మ్రింగలేక, కక్కలేక సంజయుడు నానా రకాల మాటల మహేంద్రజాలం చేసాడు. మీరు గొప్పవారంటాడు. వారూ తక్కువవారు కాదంటాడు. యుద్ధం ఎవరికీ మంచిది కాదంటాడు. ఇది యొక ప్రత్యేకమయిన ఫక్కీ.

'జలదస్వన గంభీరత ఎలు గొప్ప'గ, దంతదీప్తి వెసగ వాసుదేవుడు సాగించిన రాయబారం (ఉద్యోగ తృతీయా శ్వాసము) స్పష్టంగానూ, విన్నవారందరూ అభినందించేటట్లు ఉన్నది.

"సారపు ధర్మమున్ విమల సత్యము పాపము చేత బొంకుచే
పారము బొందలేక చెడబారినదైన యపస్థ దక్షు లె
వ్వార లుపేక్షసేసి రది వారలచేటగు గాక ధర్మని
స్తారక మయ్యు సత్య శుభదాయక మయ్యును దైవముండెడిన్."

(ఉద్యోగ తృతీయ 273)

ధర్మానికి, సత్యానికి హాని కలుగుతున్న సందర్భాలలో పెద్దలు చూస్తూ ఊరు కొంటే వారికి చేటు తప్పదని భారతం హెచ్చరిస్తోంది.

"కర్తా కారయితా చైవ ప్రేరక శ్చాను మోదకః
సుకృతం దుష్కృతం చైవ చత్వార స్సమ భాగిన" : అని కదా ప్రమాణము.

ఎలాగు 'మాట పట్టింపు' ఈ ఉద్యోగ పర్వంలో వచ్చింది కనుక ఈ ఉద్యోగ పర్వంలోనే విదురుడు వర్తమాన భూత భవిష్యత్తరాలకు అందించిన మాటల 'విలువ' కొనియాడుదాం.

"గొడ్డలి దెబ్బతిన్న మ్రాను మళ్ళీ చిగురించి పెరగవచ్చు కాని, ఒక్క పరుషమైన మాటవల్ల విరిగిన మనసు కుదుట బడటం సాధ్యంకాదు" కాబట్టి తొందర పడి మాటలనరాదని భారత సందేశంగా మనం గ్రహించాలి.

భీష్మ పర్వములోనే పరమ పవిత్రమైన భగవద్గీత యున్నది. సమస్త మానవాళికి ముక్తిమార్గమును చూపు జ్ఞానజ్యోతి అయ్యింది.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః"

(మోక్షసన్న్యాస యోగము)

"కర్మయోగము, జ్ఞానయోగము, భక్తియోగము, సన్న్యాసయోగము మొదలగు సమస్త ధర్మముల రూపమునను నన్నారాధింపుము. నీవు కర్తృత్వాభిమానమును విడిచి, నన్నే శరణు పొందిన నిన్ను రక్షింతును." అని శ్రీ శంకర భగవత్పాదులు పై శ్లోకమును వ్యాఖ్యానించినట్లు, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు శ్రీమద్భగవద్గీత వ్యాఖ్యానమందు పేర్కొనిరి. భగవద్గీత నేటి కల్లోల మానవుని "గీత"ను భక్తితో పఠించి, ఆచరించిన మార్చగలదు. అత్ర సందేహమ్ నాస్తి.

సౌప్తిక పర్వంలో ఏ పనికయినా ప్రయత్నం, దైవం, సాధన సంపత్తి అవసరమని పేర్కొనబడింది. రైతు భూమి దున్ని, పదునుచేసి విత్తనాలు చల్లకున్నట్లయితే వానలు కురిసినా లాభం లేదు. అతను విత్తనాలు చల్లినా, వాన చినుకు పడకపోతే ప్రయోజనం శూన్యం. అందుచేత చేసే ప్రయత్నానికి దైవం తోడు అవసరం ధర్మం తప్పక చేసే పనికి దైవం సాయపడతాడు" అని ప్రతివారు ధర్మ తత్పరులు కావాలని కృపాచార్యాభిముఖంగా భారతం సందేశం వినిపించింది.

(సౌప్తిక. ప్రథమ 31)

"యతోధర్మస్తతోజయః" (ధర్మం ఎక్కడున్నదో అక్కడే జయం) ఇది గాంధారి ప్రవచనంగా స్త్రీ పర్వంలో పేర్కొనబడింది. యుద్ధానికి వెళ్ళబోయేముందు



దుర్యోధనుడు వచ్చి ఆశీర్వదించమని కోరగా, తను అలా దీవించానని కన్నీరే మేలి ముసుగుగా గల గాంధారి దుర్యోధనుని శవం చూస్తూ విలపిస్తూ కృష్ణునితో చెప్పింది.

(స్త్రీ పర్వం. ద్వితీయ - 29, 30 పద్యాలు)

"యాన్తిన్యాయ ప్రవృత్తస్య తిర్యంఞ్చోపి సహాయతాం
అ పంథానం తు గచ్ఛంతం సోదరోఽపి విముంచతి"

అని మురారి అనర్ఘ రాఘవములో ధర్మ విరుద్ధ ప్రవర్తనాశీలుని కేవలం సోదరుడే విడుచునని చెప్పియున్నాడు. భారతమున దుష్టుని తల్లి కూడా విడుస్తుందని ప్రబోధించబడియున్నది.

"ఒరులేయవి యొనరించిన - నరవర యప్రియము తనమనంబున కగుతా
నొరులకవి సేయకునికి - పరాయణము పరమ ధర్మ పథములకెల్లన్.

(శాంతిపర్వం పంచమా 220 వ పద్యం)

ఇది భారత సందేశాలలో ఆణిముత్యమని స్వీయ భావన. నిరంతరము ఈ పద్యము మననము చేసుకొన్న యెడల, చిత్తశుద్ధితో ఆ పద్య తాత్పర్యము నాచరించినచో ప్రతి జీవితమున ఎప్పుడూ వసంతమే.

యుద్ధానంతరము తమ కష్టాలకన్నింటికి మూలకారణమైన పెదనాన్నగారిని ధర్మజుడు అతులిత భక్తితో చూసుకొన్నాడట.

"సూనులు లేమిం గలిగెడు - దీనత్వము దోఁపకుండఁదేజస్సౌఖ్యా
సూనులుగాఁజేయు ధర్మజుఁ - డా నరపతి, నతని దేవి నతులిత భక్తిన్"

(ఆశ్రమవాస పర్వం)

మనకు ఎంత అపకారం చేసిన వారయినా, వారిని క్షమించే సంస్కార హృదయం ప్రతివారికి ఉండాలని ధర్మజుని ప్రవర్తన ద్వారా భారతం నిరూపిస్తోంది. ఆ శ్రుతి ప్రతి గుండెలో మ్రోగాలని "అపకారికి ఉపకార" మంటూ సుమతీ కారుడి ఉపశ్రుతి.

కౌంతేయాగ్రజునితో శ్రీకృష్ణుడు ఆధ్యాత్మ విషయములను గూర్చి ప్రస్తావిస్తూ "రెండక్షరంబులు మృత్యువు మూడక్షరంబులు బ్రహ్మంబవి యెయ్యవి యంటేని వినుము మమ యనునవియును నమమ యనునవియునై యుండు" (అశ్వమేధ ప్రథమ 121) అని నిష్కర్షగా నిర్వచించినాడు. మమ (నాది) అంటే మృత్యువు. నమమ (నాదికాదు) అంటే బహ్మము. ఆధ్యాత్మ విదులకు వేదాంతమై భారత మిట్టి చోట్ల అనర్ఘ రత్నాలందించింది. అన్వేషకులై శిరసావహించగలిగినవారు ఉత్తములౌతారు.

మహాప్రస్థానిక పర్వంలో పాండవులు భూ ప్రదక్షిణంచేసి, హిమాలయమును దాటి, మేరు పర్వతము దగ్గరగా ప్రయాణించుచుండగా, ధర్మజుడు కాక మిగిలిన పాండవులు, ద్రౌపదితో సహా వరుసగా యోగములు సడలి పతనావస్థ పొందుతారు. వారి పతనావస్థకు కారణాలుగా ధర్మజుడు పేర్కొన్న వాటన్నింటిలోనూ ప్రధానంగా కనిపించేది వారి "అహంకారం". ఇది తొలగాలి. అహంకారం కలిగియుంటే నేడే కాదు; ఏనాడయినా పతనావస్థే. ఇది భారత సందేశం.

నేటి సమాజానికి భారత మందించే సందేశాలను విశ్లేషిస్తే మళ్ళీ మహాభారతమంత గ్రంథమవుతుందేమో ! మహాభారత సందేశాలను గుండెల్లో నింపుకొని, ప్రతివారు ఉత్తమ పథగాము లగుదురుగాక !

"వ్యాసమునీంద్ర సారకరుణాతి శయంబున భారతార్థము
ద్భాసితమైన యట్టి నుత భాగ్యునకున్ సకలాగమార్థసం
వాసన మావహిల్లు జనపంక్తులు కీర్తన చేయ శశ్వదు
ల్లాస సుఖానుభూతి నచలస్థితి నొప్పునతం డుదాత్తుడై.
[స్వర్గారోహణ పర్వం - ఏకాశ్వాసం - 91వ ప]

"యదక్షర పదభ్రష్టం - మాత్రాహీనంతు యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాందేవ - నారాయణ నమోస్తుతే."

—తాడేపల్లి పతంజలి.

# యక్షప్రశ్నలు

మధురభారతి
శ్రీ మల్లాప్రగడ శ్రీ రంగారావు

మహాభారతం పంచమ వేదం. సకల ధర్మసారం. అరణ్యపర్వం చివరి భాగంలో ఉన్న "యక్ష ప్రశ్నలు" సన్నివేశంలో మానవ జీవిత పరమార్థాన్ని ప్రతిపాదించాడు వేదవ్యాసమహర్షి.

అరణ్యంలో నిత్యాగ్ని హోత్ర పరాయణుడైన ఒక బ్రాహ్మణుని అరణి (యజ్ఞాగ్నిని రగిలించే కొయ్య) ని ఒకలేడి తన కొమ్ములకు తగిలించుకు పోయింది. అరణి లేకపోతే తన నిత్య కర్మానుష్ఠానానికి అంతరాయం కలుగుతుందని ఆ బ్రాహ్మణుడు ఆవేదన చెందాడు. అరణ్యవాసం చేస్తున్న పాండవులు, ఈ వృత్తాంతం విని ఆ లేడిని వెంబడించారు. చాలా దూరం పరుగెత్తి అలసి పోయారు. ఇంతలో ఆ లేడి అదృశ్యమైంది. పాండవులకు ధర్మాన్ని నిర్వర్తించ లేకపోయామనే బాధ ఎక్కువైంది. దాహం దానికి తోడయింది. ముందు దాహాన్ని ఉపశమింప చేసుకుంటే, తర్వాత కర్తవ్యం ఆలోచించ వచ్చునని పాండవులు భావించారు. తాను దాహం తీర్చుకుని, అన్నదమ్ములకు నీళ్ళు తేవడానికి నకులుడు బయలుదేరాడు. సరోవరం దగ్గర అతనికి అదృశ్యవాణి వినిపించింది. నీరు తాకవద్దని, తన ప్రశ్నలకు సమాధానాలు చెప్పమని హెచ్చరించింది. ఆ మాటలు లెక్కచేయని నకులుడు నీళ్ళుతాగి మూర్ఛపోయాడు. సహదేవుడు, అర్జునుడు, భీమసేనుడుకూడా ఒక్కరొక్కరే వరుసగావచ్చి, అదృశ్యవాణిని లక్ష్యపెట్టక, మూర్ఛాగతులయ్యారు. చివరికి తమ్ముళ్ళను వెతుక్కుంటూ ధర్మరాజే స్వయంగా బయలుదేరాడు. సరోవరాన్ని సమీపించి, తమ్ముల దుస్థితినిచూసి విలపించాడు. కారణం అర్థంకాక, కలవర పడ్డాడు. ఇది విషప్రయోగమా ? అంటే వాళ్ళ శరీరాలు వివర్ణంకాలేదు. ఆయుధాలో, క్రూర మృగాలో - అనుకుందామంటే, తమ్ముళ్ళ శరీరాలపై గాయాలులేవు. ఇంతలో ధర్మరాజుకుకూడా అదృశ్యవాణి వినిపించింది "నా శక్తి కొద్దీ సమాధానాలు చెప్పటానికి ప్రయత్నిస్తాను" అని వినయంతో విన్నవించుకున్నాడు ధర్మరాజు. అప్పుడు ఆ అదృశ్యవాణి, "నేను యక్షుణ్ణి" అన్నది.

'యక్ష ప్రశ్నలు' ప్రారంభమయ్యాయి. ధర్మరాజు వాటికి సముచితమైన సమాధానాలు అందించ సాగాడు.

ఈ ప్రశ్నోత్తరాల్లో ధర్మం, సత్యం, తపస్సు, యజ్ఞం, దానం, త్యాగం మొదలైన సద్గుణ స్వభావాలు, కామక్రోధ మద లోభాదులైన దుర్గుణాల తీరు తెన్నులు, శత్రు మిత్ర లక్షణాలు, ద్వంద్వాతీత స్థితి, మాతాపితృభక్తి, అతిథి దేవత ఆరాధన, దాంపత్య ధర్మం, స్వర్గ నరక వివేచనం, దేవ, పితృ యజ్ఞ విశేషాలు, విశ్వమానవ ప్రేమ - ఒకటేమిటి? సకల ధర్మసారం ఇందులో సాక్షాత్కరిస్తుంది.

## ప్రశ్నోత్తరాలు

1) సూర్యుణ్ణి ఉదయింపచేసేది ఏది ? 'బ్రహ్మ'
(బ్రహ్మ అంటే-త్రిమూర్తులలో ఒకడైన బ్రహ్మకాదు. పరబ్రహ్మ)

2) సూర్యుణ్ణి అనుసరిస్తూ, ఆరాధిస్తున్నది ఎవరు ? దేవతలు

3) సూర్యుణ్ణి అస్తమింపచేసేది ఎవరు ? ధర్మము
(ఇక్కడ సూర్యుడంటే జీవుడు. ధర్మాచరణవల్ల జీవుడు 'స్వస్థానం' చేరుకుంటాడు)

4) సూర్య తేజస్సుకి ఆధారమేది ? సత్యము

5) మానవుడు దేనివల్ల శ్రోత్రియుడు అవుతున్నాడు ?
వేదప్రామాణ్యాన్ని అంగీకరించడంవల్ల

6) మానవుడు దేనివల్ల గొప్పవాడు అవుతున్నాడు ? తపస్సువల్ల

7) ద్వితీయుడు ఎవరు ? ధైర్యం కలవాడు
(మానవుడికి అన్ని వేళలా అండగా నిలిచేది ధైర్యమే)

8) మానవుడు దేనివల్ల బుద్ధిమంతుడు ? పెద్దలను సేవించడంవల్ల

9) బ్రాహ్మణులకు దివ్యత్వం ఏది ? వేదాధ్యయనము.

10) వారికి సదాచారము ఏది ? శమ దమాలతో కూడిన తపస్సు.
(శమము అంటే మనస్సును నిగ్రహించడము, దమము అంటే బాహ్యేంద్రియములను నిగ్రహించడము)



11) బ్రాహ్మణులకు మనుష్యభావాన్ని కలిగించేది ఏది ? మరణం.
(దేహాభిమానం లేదా మరణ భయము)

12) బ్రాహ్మణులకు తగనిది ఏది ? పెద్దలను నిందించడం.

13) క్షత్రియులకు దివ్యత్వం ఏది ? ధనుర్విద్య.

14) క్షత్రియులకు సదాచారము ఏది ? యజ్ఞం చేయడం.

15) క్షత్రియులకు మనుష్యత్వం ఏది ? పిరికితనము.

16) క్షత్రియులకు తగనిది ఏది ? శరణుకోరినవారిని కాపాడలేక వదిలి పెట్టడం.

17) యజ్ఞ సంబంధమైన సామం ఏది ? ప్రాణం.
(ప్రాణాయామం మొదలైన యోగసాధన)

18) యజ్ఞ సంబంధమైన యజుర్వేద మంత్రం ఏది ? మనస్సు.
(మనో నిగ్రహం)

19) యజ్ఞాన్ని వరించింది ఏది ? ఋక్కు.

20) యజ్ఞం దేన్ని అనుసరించి ఉంటుంది ? వేదవాక్కును.

21) వ్యవసాయదారులకు ఏది శ్రేష్ఠము ? సకాలంలో కురిసిన వర్షము.

22) వ్యవసాయదారులకు ముఖ్యమైనది ఏది ? మంచి విత్తనము.

23) కీర్తి ప్రతిష్ఠలు పొందాలంటే ఏం చేయాలి ? గోసేవ.

24) సంతతి కోరుకునే వారికి ఫలం ఏమిటి ? సత్పుత్రులను పొందడం.

25) ఉచ్ఛ్వాస నిశ్వాసాలున్నా, జీవించనివాడు ఎవరు ?
దేవతలను, అతిథులను, తనకుటుంబ పరివారాన్ని, పితృదేవతలను, ఆత్మజ్ఞానాన్ని పెంచి, పోషించనివాడు. అలాంటివాడు జీవచ్ఛవమే కదా!

26) భూమికంటె గొప్పది ఏది ? తల్లి.

27) ఆకాశంకంటె ఉన్నతమైంది ఏది ? తండ్రి.
(దేహము, విజ్ఞానము, బ్రహ్మోపదేశము ఇచ్చేవాడు తండ్రి)

28) గాలికంటె వేగంగా నడిచేది ఏది ? మనస్సు.

29) గడ్డిపరకలకంటె హేయమైనది ఏది ? చింత.

30) నిద్రిస్తున్నప్పుడుకూడా కన్నుమూత పడనిది ఏది ? చేప.
31) పుట్టినా, కదలనిది ఏది ? గ్రుడ్డు.
32) హృదయంలేని వస్తువు ఏది ? బండ.
33) వేగంవల్ల వృద్ధి పొందేది ఏది ? నది.
34) ప్రవాసంలో ఉన్నవాడికి మిత్రుడు ఎవరు ?
తనతోపాటు ప్రయాణం చేసేవాడు.
35) ఇంటిలోఉన్న మిత్రుడు ఎవరు : భార్య.
36) రోగికి మిత్రుడు ఎవరు ? వైద్యుడు.
37) అశాశ్వతమైన మానవ జీవితంలో శాశ్వతమైన మిత్రుడు ఎవరు ? దానము.
38) అతిథి ఎవరు ? అగ్ని
(ప్రాణుల హృదయంలోఉన్న వైశ్వానరుడనే అగ్ని)
39) సనాతన ధర్మం ఏది ? మోక్షహేతువైన కర్తవ్యము.
40) అమృతం ఏది ? చంద్రుడు, గోవు. (చంద్రుని వెన్నెల, ఆవుపాలు)
41) జగత్తు అంతటా ఉన్నది ఏది ? వాయువు.
42) ఒంటరిగా సంచరించేది ఎవరు ? సూర్యుడు.
43) పుట్టి, మళ్ళీ మళ్ళీ పుట్టేది ఎవరు ? ఏది ? చంద్రుడు, మనస్సు.
44) మంచుకు ఔషధం ఏది ? అగ్ని
(అజ్ఞానమనే మంచు ఆవరించి ఉన్నప్పుడు 'సత్యం' గోచరించదు.
జ్ఞానాగ్నియే దానికి మందు)
45) గొప్ప క్షేత్రము ఏది ? భూమి - శరీరము.
(తత్త్వబీజాలు నాటితే జ్ఞానం అంకురించగలదు)
46) ధర్మానికి స్థానం ఏది ? దక్షత. (సామర్థ్యం)
47) కీర్తికి స్థానం ఏది ? దానము.
48) స్వర్గానికి స్థానం ఏది ? సత్యము.



49) సుఖానికి స్థానం ఏది ? శీలము.
50) మానవునికి ఆత్మ ఏది ? పుత్రుడు.
["ఆత్మావై పుత్ర నామాసి" అని వేద వచనం]
51) దైవమిచ్చిన మిత్రుడు ఎవరు ? భార్య.
52) జీవనానికి ఆధారము ఏది ; మేఘము.
53) జీవిత పరమార్థము ఏది ? దానము.
54) ధనసంపాదనకు ఉత్తమ సాధనం ఏది ? కర్మాచరణ కౌశలము
55) ఉత్తమ ధనము ఏది ? విద్య.
56) అన్నింటికంటె గొప్ప లాభం ఏది ? ఆరోగ్యము
57) శ్రేష్ఠమైన సుఖము ఏది ? సంతృప్తి.
58) శ్రేష్ఠమైన ధర్మము ఏది ? సర్వభూతదయ.
59) ఎప్పుడూ పండేది ఏది ? 'త్రయీధర్మం' [త్రయీ - వేదము]
60) శోకం లేకుండా ఉండాలంటే, దేన్ని అదుపు చేసుకోవాలి ? మనస్సును.
61) ఎవరితో స్నేహం శాశ్వతంగా ఉంటుంది ? సజ్జనులతో.
62) మానవుడు అందరికీ ప్రీతిపాత్రుడు కావాలంటే దేన్ని వదలి పెట్టాలి ?
అహంకారాన్ని.
63) దేన్ని వదలితే శోకం వుండదు ? క్రోధమును.
64) దేన్ని వదిలితే జీవితం సార్థకం అవుతుంది ? కామమును.
65) సుఖం పొందాలంటే దేన్ని విడిచి పెట్టాలి ? లోభమును.
66) బ్రాహ్మణునికి దానం చేయడం ఎందుకు ? ధర్మముకొఱకు
67) కళాకారులకు దానం చేయడం ఎందుకు ? కీర్తి కోసం.
68) సేవకులకు దానం ఎందుకు ? వారిని పోషించడానికి.
69) రాజులకు దానం (పన్నులు చెల్లించడం) ఎందుకు ? భయంవల్ల,
[శత్రుభయం, చోరభయం లేకుండా పాలించి, రక్షించేవాడు రాజు]

70) ఈ జగత్తును అంతటినీ ఆవరించి ఉన్నది ఏది ? అజ్ఞానము.

71) ఎందువల్ల ఈ జగత్తు ప్రకాశించడం లేదు ? తమస్సువల్ల.
[తమస్సు - చీకటి, అజ్ఞానము, తమోగుణము]

72) మానవుడు తన స్నేహితులను ఎందువల్ల పోగొట్టుకొంటున్నాడు ? లోభంవల్ల.

73) మానవుడు ఎందువల్ల స్వర్గాన్ని పొందలేక పోతున్నాడు ?
ప్రాపంచిక వ్యామోహంవల్ల.

74) మానవుడు దేనివల్ల జీవచ్ఛవం అవుతాడు ? పిసినారితనంవల్ల.

75) దేశం ఎందువల్ల మృత ప్రాయం అవుతుంది ? రాజు లేనప్పుడు.
[దేశం - దేహం; రాజు : ప్రకాశించేవాడు, చైతన్యం, జ్ఞానం].

76) శ్రాద్ధకర్మ ఎందువల్ల వ్యర్థమవుతుంది ?
శ్రోత్రియులైన బ్రాహ్మణులు లేకపోవడంవల్ల.

77) యజ్ఞం ఎందువల్ల నిష్ఫలం అవుతుంది ? "దక్షిణ" లేనందువల్ల.

78) దిక్కు ఏమిటి ? సత్పురుషులే [దిక్కు అంటే ఆధారం]

79) నీరు ఏది ? ఆకాశమే.

80) అన్నమంటే ఏది ? భూమి.

81) విషం ఏది ? కోరిక.

82) శ్రాద్ధకర్మకు తగిన కాలము ఏది ?
వేదవిదుడు, జ్ఞాని అయిన బ్రాహ్మణుడు లభించిన కాలమే.

83) తపస్సు అంటే ఏమిటి ? స్వధర్మము.
[వర్ణాశ్రమ ధర్మాలు, వృత్తి ఉద్యోగాలకు సంబంధించిన విధ్యుక్త ధర్మాలు]

84) దమము అంటే ఏమిటి ? ఇంద్రియములను నిగ్రహించడమే

85) క్షమాగుణం అంటే ఏమిటి ? ద్వంద్వాలను సహించడం.
[శీతోష్ణాలు, సుఖదుఃఖాలు, మానావమానాలు, నిందాస్తుతులు, కలిమిలేములు మొ॥వి ద్వంద్వాలు]



86) లజ్జ అంటే ఏమిటి ? తగని పనులు చేయకుండా ఉండడం.

87) జ్ఞానమంటే ఏమిటి ? పరమార్థతత్త్వం తెలుసుకోవడం.

88) శమము అంటే ఏమిటి ? చిత్తవృత్తులు అదుపులో ఉండడం.

89) దయ అంటే ఏమిటి ?
అందరూ సుఖంగా ఉండాలని కోరుకునే మనస్తత్వం.

90) ఆర్జవం అంటే ఏమిటి ? సమచిత్తము
[అన్నిటియందు భగవద్రూపమును భావించుట]

91) మానవుడు జయించలేని శత్రువు ఎవరు ? క్రోధము.

92) అంతులేని వ్యాధి ఏది ? లోభము.

93) సాధుగుణం అంటే ఏది ? సర్వభూతహితం కోరడం.

94) చెడ్డగుణం ఏది ? నిర్దయ.

95) మోహం అంటే ఏమిటి ? ధర్మాన్ని గుర్తించలేని మానసిక స్థితి.

96) మానం అంటే ఏమిటి ? ఆత్మాభిమానము.

97) ఆలస్యం ఏది ?
కర్తవ్యాన్ని నిర్లక్ష్యం చేయడం, ధర్మాన్ని నిర్వర్తించక పోవడం.

98) శోకం ఏమిటి ? అజ్ఞానమే.

99) స్థైర్యం ఏమిటి ? స్వధర్మ నిర్వహణలో నిశ్చలంగా నిలబడడం.

100) ధైర్యం అంటే ఏమిటి ? ఇంద్రియ నిగ్రహము.

101) ఉత్తమమైన స్నానం ఏది ? మనోగత మాలిన్యాన్ని తొలగించేది.

102) దానం అంటే ఏమిటి ? సాటి ప్రాణులను రక్షించడం.

103) పండితుడు ఎవరు ? ధర్మం తెలిసినవాడు.

104) నాస్తికుడు ఎలాంటివాడు ?
మూర్ఖుడు. వేదంపట్ల ప్రామాణ్యబుద్ధి లేనివాడు.

105) మూర్ఖుడు ఎవరు ? నాస్తికుడు.

106) కామం అంటే ఏమిటి ? సంసార హేతువైన విషయవాసన.

107) మాత్సర్యం అంటే ఏమిటి ? మనస్తాపం.

108) అహంకారం అంటే ఏమిటి ? అజ్ఞానము.

109) దంభం అంటే ఏమిటి ? తన్నుతాను ధార్మికునిగా చాటుకోవడం.

110) దైవమంటే ఎవరు ? దానఫలం.

111) పైశున్యం (నీచత్వం) అంటే ఏమిటి ? చాడీలు చెప్పడం.

112) పరస్పర విరుద్ధాలైన ధర్మార్థ కామాలు మూడూ ఒకచోట సంభవించడం ఎలా ?
అగ్నిహోత్రము, దానధర్మాలు, భార్య తనవశంలో ఉన్న మానవుడికి ఇది సాధ్యం అవుతుంది. అగ్నిహోత్రంవల్ల ధర్మం, దానం వల్ల ధనం, భార్య వలన కామం ఏకత్ర నిలుస్తాయి.

113) అంతులేని నరకం ఎవరికి ప్రాప్తిస్తుంది ?
సదాచారము, సచ్ఛీలము, వేదజ్ఞానముగల బ్రాహ్మణుణ్ణి భోజనానికి ఆహ్వానించి, తీరా అతడు వచ్చిన తరువాత భోజనం పెట్టని వారికి, వేదశాస్త్రాలపట్ల, ధర్మంపట్ల, పితృదేవతలపట్ల గౌరవం లేని వారికి, సంపదలున్నా తనవారిని అనుభవించనీయకుండా, తానూ అనుభవించకుండా, దానధర్మాలూ ఆచరించకుండా లోభంతో ప్రవర్తించే వారికి అక్షయమైన నరకం ప్రాప్తిస్తుంది.

114) దేనివల్ల బ్రాహ్మణత్వం సిద్ధిస్తుంది ?
పుట్టుకగాని, వేదాధ్యయనంగాని, శాస్త్రపాండిత్యంగాని బ్రాహ్మణత్వాన్ని నిర్ణయించవు, ఉత్తమ శీలమే బ్రాహ్మణత్వము.

115) ప్రియవాదికి లాభం ఏమిటి ? అందరికీ ప్రీతిపాత్రుడు కావటం.

116) బాగా ఆలోచించి, పనిచేసిన వానికి లాభం ఏమిటి ? కార్యసాఫల్యం.

117) అనేకమంది మిత్రులున్న వానికి లాభం ఏమిటి ? సుఖశాంతులు.

118) ధర్మాత్ముడికి లాభం ఏమిటి ?
ఇహలోకంలో సుఖం, పరలోకంలో శాంతి, స్వర్గం.



119) ఎవడు సంతోషంగా ఉంటాడు ?
బ్రతుకు తెరువుకోసం ప్రయాసపడి, విదేశసంచారం చేయవలసిన అవసరం లేనివాడు.

120) ఆశ్చర్యం ఏది ?
ప్రతి నిత్యమూ యమసదనానికి ప్రయాణం కట్టేవాళ్ళని చూస్తూకూడా, తాను మాత్రం శాశ్వతంగా ఉంటానని భ్రాంతిపడడం ఆశ్చర్యం.

121) ఏది సరిఅయిన మార్గము ?
సత్పురుషులు తమ జీవితంలో అనుసరించిన మార్గం.

122) వింత వార్త ఏది ?
ప్రపంచమనే పెద్దగిన్నెలో సూర్యుడనే అగ్నితో రాత్రింబవళ్ళు అనే ఇంధనంతో కాలచక్రం అనే గరిటతో కాలపురుషుడు అనే వంటవాడు జీవులందరిని "పచనం" చేయడం.

123) పురుషు డెవరు ? భూమ్యాకాశాలు వ్యాపించిన కీర్తి గలవాడు.

124) సర్వధని ఎవరు ? ద్వంద్వాలకు అతీతంగా సమదృష్టి గలవాడు.



ఈ విధంగా - అడిగిన ప్రశ్నలన్నింటికీ ధర్మబద్ధము, సత్య సమ్మతము అయిన సమాధానాలు రావడంతో యక్షుడు సంతృప్తి చెందాడు. ఒక వరం కోరుకో మన్నాడు. నకులుణ్ణి బ్రతికించమని కోరాడు ధర్మరాజు. భీమార్జునులు వీరాగ్రేసరులని, పైగా సొంత తమ్ముళ్ళు అని, నకులుడు సవతి తమ్ముడని గుర్తుచేసాడు యక్షుడు. కాని, తన తల్లి సంతానంలో పెద్దవాడైన తాను జీవించి ఉన్నందువల్ల తన పినతల్లి సంతానంలో జ్యేష్ఠుడైన నకులుణ్ణి బ్రతికించమని ధర్మరాజు కోరాడు. అతని ధర్మ దీక్షకు సంతోషించి యక్షుడు నిజరూపం చూపించాడు. యమధర్మరాజే యక్షుడు. మరో వరం కోరుకోమన్నాడు. నిరంతరం ధర్మదీక్షాపరుడైన ధర్మరాజు ఈ పరీక్షలో కూడా విజయం సాధించాడు. శరణాగత రక్షణ ధర్మం తనకు అభిలషణీయం అని,

తన్ను శరణు పొందిన బ్రాహ్మణుని అగ్నిదేవతారాధనకు అవసరమైన అరణిని అనుగ్రహించ వలసిందిగా కోరాడు. తనకోసం కాక, తన తమ్ముళ్ళను బ్రతికించు కోవడం కోసమూకాక, శరణాగత రక్షణకోసం వరం కోరుకున్న ధర్మరాజులోని ధర్మప్రవృత్తి మానవాళికి ఆదర్శం. అడుగడుగునా ధర్మరాజులో కన్పించే ధర్మ దీక్షకి యమధర్మరాజు పూర్తిగా సంతృప్తి చెందాడు. అరణి, లేడి, బ్రాహ్మణుడు - ఇదంతా తన మాయా ప్రభావమే అని ఊరడించాడు. పాండవులందరినీ బ్రతికించాడు. రాబోయే అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా సఫలమవుతుందని ఆశీర్వదించి, అంతర్ధానం అయ్యాడు. ధర్మదీక్షాపరుడైన ధర్మరాజుకు కోరకుండానే ఈవరం దక్కింది.

ఈ కథా సన్నివేశం ధర్మాసక్తిని, సమభావాన్ని, నిష్కామతను ప్రసాదింప గలదని ఫలశ్రుతిని అనుగ్రహిస్తూ, వ్యాసమహర్షి ఈ ఘట్టాన్ని ముగించాడు.

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని,
    యధ్యాత్మవిదులు వేదాంత మనియు,
నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని
    కవి వృషభులు మహాకావ్యమనియు,
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమని
    యైతి హాసికు లితిహాసమనియు
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
    యంబని మహిఁగొనియాడుచుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాది ముని పరాశరాత్మజుండు
విష్ణు సన్నిభుండు విశ్వజనీనమై
పరఁగు చుండఁజేసె భారతంబు - నన్నయ.

# విదురనీతి

డాక్టరు. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి

"వందే మహిచతాం వాణీ మమృతా మాత్మనః కలాం" (భవభూతి)

భరత వీరులైన కురు పాండవుల చరిత్రగా ప్రఖ్యాతి గాంచిన భారతం ముఖ్యంగా 'దాయాదుల మధ్య జరిగిన తగాదా' అని అందరికి తెలిసిందే. సమాజం లోని మంచి చెడులను విశ్లేషించి చెప్పటం కోసం వ్యాసమహర్షి తన మనుమలైన పాండవులను, ధార్తరాష్ట్రులను ఉదాహరణంగా తీసుకొని ప్రపంచానికి నీతిని, లోకరీతిని ప్రకటించాడు. వ్యాసమహర్షికి ధర్మాభిమానమే తప్ప వీరిరువురిలో ఎవరియెడ ప్రత్యేకించి రాగ ద్వేషములు లేవు. నిర్వికార మానసుడైన ఆ మహర్షి అవసరమైనప్పుడల్లా కురు, పాండవు లిరువురికి జ్ఞానం ఉపదేశిస్తూనే వచ్చాడు. సక్రమంగా అర్థం చేసుకొని ఆచరించిన, ధర్మాత్ములైన పాండవులు చిరకీర్తి నార్జించుకొన్నారు. దుష్టత్వానికి, దుర్మార్గానికి మారు పేరుగా నిలచిన కౌరవులు అపనిందల పాలయ్యారు-అనర్థములను కొని తెచ్చుకొన్నారు వేదార్థ సారమగు. భారత కథా పరమార్థమును వివరించెడి ఆ యా ఘట్టములలో విదురనీతి యొకటి. ఇందు అందరికి కంఠస్థము చేయదగి, ఆచరణ యోగ్యములైన పెక్కు విశేషములు కలవు.

నియమము ననుసరించి పాండవులు అరణ్యవాస, అజ్ఞాత వాసములు పూర్తి చేసుకొని ఉపప్లావ్యమునకు చేరారు. బంధుమిత్రులతో కలిసి చర్చించి, ముందుగా ద్రుపద పురోహితుని ద్వారా తమ తండ్రి భాగము తమకిమ్మని చెప్పి పంపించారు.

కౌరవపతి అందుకు తగిన సమాధానం చెప్పక, తమ అభిప్రాయం ప్రత్యేకంగా వేరొక వ్యక్తిచే తెలియజేయగలమని అన్నాడు. తర్వాత, ధృతరాష్ట్రుడు సారవ చోధురీణుడు, నయవిశారదుడు అయిన సంజయుని పిలిపించి, పాండవుల హృదయాలు ప్రసన్నమయ్యే రీతిగా, మాట్లాడి రమ్మని పంపించాడు. 'కర్ర విరగకుండా పాము చావకుండా' అనే సామెత ననుసరించి అతడు పాండవులను పొగడి, కౌరవులను కొనియాడి, వారిద్దరూ పాలూ, నీరు వలె ఒకటిగా కలిసి ఉండటం తగవని చెప్పి

ఒకవేళ కౌరవులు దుశ్శీలురై రాజ్య భాగం ఇవ్వకపోయినా ధర్మ తత్పరులైన మీరు భిక్షాన్నంతోనైనా, తృప్తి పడటమే మీ నడవడికి మేలని వివరించాడు.

పాండవులు 'ధర్మంగా తమకు రావలసిన భూభాగం వారు ఇవ్వకపోయినట్లైతే యుద్ధం తప్పదని, కౌరవ పతి ఉపేక్షయే ఇంతటి అనర్థ పరంపరకు కారణమని, ఇప్పటికైనా వారితో కలిసి జీవించుటకు తమ కేదిద్రమైన అభ్యంతరం లేదని లోభ గుణంతో రాజ్యం పంచి ఇవ్వటానికి ఇష్టపడని పక్షంలో తాము దండెత్తి వస్తామని చెప్పారు.

సంజయుడు పాండవుల వద్ద సెలవు తీసుకొని, హస్తినకు చేరి, ధృతరాష్ట్రునకు తనరాక ఎఱిగించి, మరునాడు సభలో పాండవాభిప్రాయాన్ని వివరింపగలనని చెప్పి, అతని అనుమతి గొని వెళ్ళిపోయాడు.

ధృతరాష్ట్రుడు కొంతసేపు కార్యచింతన మొనరించి, విదురుని పిలిపించి ఆతనితో సంజయుని రాక గూర్చి వివరించి నా మనసెందుకో విచారగ్రస్తమై ఉంది, శరీరం నిప్పులలో పొర్లినట్లు బాధిస్తోంది, నిద్ర పట్టడంలేదు అని చెప్పాడు.

అందుకు విదురుడు సమాధానంగా "బలవంతుడు పైనెత్తిన బలహీనుడు, ధనం పోగొట్టుకొన్నవాడు, దొంగతనం చేయాలని వేచి ఉన్నవాడు, కామాతుల చిత్తుడు, నిద్రలేక బాధపడతారని చెప్పి, రాజా ! ఈ కొఱగాములలో ఏది నీ చిత్త వృత్తిని బాధిస్తోందో. చెప్పమని అడిగి పరధనాపహరణం చేయాలని నీవు కోరు కొంటున్నావా ? ఏమి అని ధృతరాష్ట్రుని ప్రశ్నించాడు - అందుకు ఆ మహారాజు ధర్మజుని అభిప్రాయమేమిటో తెలియక నా మనస్సు వ్యాకుల పడుతోంది" అని చెప్పి ఆతని హృదయం వివరించటానికి నీవే సమర్థుడవు. కావున తెలియ జెప్పమని అడిగాడు.

విదురుడది విని, ముందుగా శాంతమూర్తియైన ధర్మజుని బుద్ధి కొనియాడి, ఆ తర్వాత అధర్మవర్తనులై మొదటినుండి నీవు, నీ కొడుకు వారికింత కాలం కీడు తలపెడ్తూనే వస్తున్నారు - మీరు శకుని, కర్ణ, దుశ్శాసనులపై కార్యభారం మోపి వారు చెప్పినట్లే ప్రవర్తిస్తున్నారు. అది అసమంజస మగుట మీకు మేలు చేకూర్చదు.



"తమను తాము తెలుసుకోవటం, తొందరపాటుతనం లేకపోవటం, ఓర్పు వహించడం, త్యాగబుద్ధి కలిగి ఉండటం, లేని ప్రభుత్వం ఎప్పుడూ స్థిరంగా ఉండదు. ఈ సజ్జన లక్షణాలు ఏవీ నీవారిలో లేవు, అది నీకు తెలుసు - యుధిష్ఠిరుడెన్నడూ ధర్మాన్ని విడిచిపెట్టకుండా, సహన బుద్ధియై ఉండటం, లోకమెరిగిన సత్యమే కదా" అని వివరించాడు.

అది విని ధృతరాష్ట్రుడు "మరునాడు సంజయుని మాటలు విని నీవు చేయదగింది చెప్పి, చేయించవచ్చు. ఇప్పుడు ఆవేదనతో తల్లడిల్లే నా మనస్సుకు హితవచనాలు చెప్పి, ఊరట కల్గింపమని కోరాడు.

ధర్మాధర్మ విదుడు, నయానయములు తెలిసినవాడు అయిన విదురుడు అప్పుడు తన వచనామృతముచే ఆతని హృదయం తేటపడేలా ఈ విధంగా చెప్పటం ప్రారంభించాడు.

ఈ విదురనీతి మానసిక వికారాన్ని పోగొట్టి, బుద్ధి వికాసాన్ని కల్గిస్తుందన్న మాట. ఇది ఒక ధృతరాష్ట్రునికే కాక, స్వార్థచింతనులు, దుర్మార్గ వర్తనులు అయిన జనులకు హితం చెప్పి, కర్తవ్యాన్ని బోధింపగలదని వ్యాసుని, సంకల్పము. "ఓ రాజా ! మానవులు నింద్యములైన పనులు మాని, లోకం హర్షించే సన్మార్గంలో నడుస్తూ, ఇతరుల సంపదలకు అసూయపడకుండా మనుజులతో మైత్రి కలిగి ప్రవర్తించటం మంచిది.

కోపము, ఉద్రేకము, గర్వము, అసంతృప్తి, దురభిమానము, నిర్వ్యాపారము (క్రియాశూన్యత) అనునవి దుర్జన లక్షణములు.

ప్రభువును, దైవమును, ఆరాధిస్తూ, భార్యను, బంధువులను సచ్ఛీలంతో సంప్రీతులను చేయని మూర్ఖుడు ఆ ఫలములను మాత్రం కోరుకోవడం వసుంజసం కాదు - అట్టివారు తమపై ప్రేమగల వారిని ఈసడించటం, తమ నొల్లని వారి వెంటబడి తిరగటం, ఉపాయం తెలియక అపాయంలో పడటం. బలవంతులతో విరోధం పెట్టుకోవటం చేస్తూ ఉంటారు. అది వారి అజ్ఞానానికి నిదర్శనం.

ధనము, విద్య, వంశము, దుర్మతులకు గర్వమును కల్గిస్తాయి - సజ్జనులకు అవియే అడకువ, వినయము ఎప్పడేలా చేస్తాయి.

గొప్ప విలుకాని ధనస్సు నుండి వెలువడిన బాణం లక్ష్యాన్ని ఛేదించనువచ్చు, లేక తప్పిపోవనువచ్చు - కాని నేర్పరియైనవాని నీతి కౌశలము (వర్తనము) పగవారిని సమూలంగా నాశనం చేస్తుంది.

ఒకటిఁగొని, రెంటి నిశ్చల యుక్తిఁజేర్చి
మూటి, నాల్గింటిఁ గడువశ్యములుగఁజేసి
యేనిటినిగెల్చి, యాఱిటి నెఱిగి, యేడు
విడిచి వర్తించువాడు వివేకధనుడు.

మనస్సు స్వాధీన పరచుకొని, సుఖదుఃఖములను సమానముగ గ్రహించి ఈషణత్రయమును, (దారా, పుత్ర, ధనములు) ధర్మార్థ కామ మోక్షములకు అధీనముగ చేసి, పంచేంద్రియములను గెల్చి, కామ క్రోధాదులను దెలిసి, సప్తవ్యసనములను విడిచిపెట్టి ప్రవర్తింప గలిగినవాడే వివేకధనుడు.

పంక్తిలో ఇతరులను విడచి, మధురాహారములు తానొక్కడే భుజించుట. పలువురు నిద్రించేచోట ఒంటరిగా మేల్కొనుట, ఒంటిగా కార్యాలోచనము చేయుట దుర్గమ మార్గమున ఒక్కడే ప్రయాణము చేయుట తగదు.

జీవన సముద్రమును దాటించే నావ లోకంలో సత్యమొక్కటే, దానిని మించిన సద్గుణము వేరొకటిలేదు. లోకులు క్షమాస్వరూపుని చూచి అసమర్థుడని భావించటం కద్దు. అయినప్పటికి ఆ క్షమయే మిక్కిలి అలంకారము. ఉత్తమ చరిత్రులైనవారు దానినే ఎల్లప్పుడు ధరిస్తారు.

పరుష వచనములు పలుక కుండుట, పాపకార్యములు చేయకుండుట వలననే పురుషుడు లోకంలో ఉత్తముడుగా కీర్తింపబడతాడు. సామర్థ్యము కలిగి ఉండి సహనము వహించేవాడు, పేదరికంలో ఉండి కూడా, తనకున్నంతలో అతిథికి ప్రీతితో ఇచ్చేవాడు పుణ్యపురుషులని పేర్కొనబడతారు.

ధర్మము తప్పక సంపాదించిన సొమ్ము అపాత్రులకు దానమివ్వటం, పాత్రులైన వారికి ఇవ్వక పోవటం. ఈ రెండూ చివరకు అపకారములుగానే పరిణమిస్తాయి.



పరస్త్రీ వ్యామోహము, జూదము, మద్యపానము, వేట, పరుష భాషణము తీవ్ర దండనము. (కాఠిన్యమును వహించుట) సొమ్ము వృధా (వ్యయము) చేయుట అనునవి ఏడును సప్త వ్యసనములు.

తగిన వేషమును (వస్త్రము) ధరించుట, తనను తాను పొగడు కొనకుండుట, బాధలు పడినను కీడు పలుక కుండుట, (అపకారమును తలప కుండుట) దానము చేసిన పిమ్మట దుఃఖింప కుండుట, తనకు ఎంత గడవని స్థితి ఏర్పడినను, ధర్మమును తప్పకుండుట అనునవి మానవుని నడవడికి మేలు చేకూరుస్తాయి. శీలమునకు వన్నె తెస్తాయి.

స్నేహము, సంభాషణము, విరోధము, వ్యవహారము, యుద్ధము తమకు అన్ని విధముల సమానులైన వారితో మాత్రమే చెయ్యాలి. తమ కన్న ఎక్కువ వారితో గాని, తక్కువ వారితో గాని అవి తగవు.

ఉన్నది కొంచెమే అయినా దానిలో ఇతరుల కింత పెట్టి, తాము తినుటయే మేలు. కష్టపడి, శ్రమకోర్చి, అల్పమగు సుఖమునే అనుభవించుట హితము. చేయిచాచి అడిగినప్పుడు శత్రువు కైనా ఇవ్వటమే గొప్ప.

సజ్జనుడు లోకము తన్ను గొనియాడగా విని ఉప్పొంగిపోక, ఇంకను మిక్కిలి హితమునే ఆచరిస్తాడు. తన యందు ఏ విధమైన దోషము ఏర్పడనీయక పోవుటేగాక, ఇతరులకు తన వలన ఎటువంటి కీడును కలుగనీయడు." -

ఈ రకమైన సత్ప్రవర్తన ధర్మనందనుని యందు కలదని పలికి, విదురుడు ఈ సందర్భంగా గుణవంతులైన పాండవులను ప్రశంసించి, దుర్మార్గవర్తనులైన దుర్యోధనాదులను నిందించాడు.

"మహారాజా ! ఇప్పటికైనను నీవు ఉపేక్షింపక పాండవుల రప్పించి, వారికి ధర్మబద్ధముగ రావలసిన రాజ్యభాగమిప్పించి, నీ కొడుకులతో సమానముగ ఆదరించుట, నీ పెద్దరికమును నిలబెట్టుకొనుట, నీవు చేయదగిన పని" అని చెప్పాడు. అప్పుడా మాటలు విని ధృతరాష్ట్రుడు కొద్దిగా తల ఊపి, "హితము, కర్తవ్యము

తెలిసిన వాడవు, ఇప్పుడు నన్నేమి చేయమంటావో చెప్పమని" అడిగాడు. అందుకు సమాధానంగా విదురుడు తిరిగి ఇలా చెప్పటం ప్రారంభించాడు.

"రాజా" నీవు నన్నింత గట్టిగా అడుగుచున్నందుకు యదార్థమును చెప్పెదను వినుము. ఎఱకై చేప గాలమును మ్రింగినట్లు చేజిక్కినవి (దక్కింది) గదాయని నీ తమ్ముని భాగము ఆతని తనయులకియ్యక, నీ వొక్కడవే అనుభవించాలని చూస్తున్నావు వినాశహేతువైన ఆ పని నీకెంత మాత్రము తగదు. మూర్ఖుడైన నీ కుమారుని యభిప్రాయము నెరవేరదు."

అది విన్న ధృతరాష్ట్రుడు కొంతసేపు నిశ్చేష్టుడై ఉండి మనసులో ఎన్నో ఆలోచనలు ముసురుకొని నిద్ర రాకపోవటం వలన విదురునితో "ఇందాక నీవు చెప్పిన మంచి మాటల వలన, నా మనోవేదన కొంత చల్లారింది. నా కింకను న్యాయాన్యాయములను గూర్చి చెప్పుమ"ని కోరాడు. అప్పుడా విదురుడు "ఓ రాజా ! కాయ పూర్తిగా పండకుండానే కోస్తే రుచి ఉండదు సరి కదా ! విత్తనములు కూడా దక్కవు. అదే పక్వానికి వచ్చిన తర్వాత అయితే అది మధురంగాను ఉంటుంది, బీజములు సహితం లభిస్తాయి. ఇట్టిదే కార్యసాధన మార్గము.

తోటమాలి పూవులు కోసినట్లు, తుమ్మెద పూలలోని మకరందాన్ని ఆస్వాదించినట్లు, ఎదుటి వారికి నొప్పి కలుగకుండ ప్రయోజనమును పొందుట కార్య ఫలముకొని, మొదలంట నరికి బొగ్గులకు వినియోగింపరాదు.

ఇతరుల ధనమునకు, విద్యా పరిణతికి, తేజమునకు, బలమునకు, పరితపిస్తూ సహనమును కోల్పోయే మానవుడు తెవులు లేని వేదనపాలై, చెడిపోతాడు.

ఎదుటి వారికి హితమును, ప్రియమును, మనస్సునకు ఉల్లాసమును కలిగించు మాటలాడుట తగిన పని. కాకున్న మౌనము వహించుటయే మేలు.

స్నేహము, విరోధము, ప్రసన్నత, వ్యాకులత, పుణ్యము, పాపము, గౌరవము, అగౌరవము, సజ్జన, దుర్జనత్వములు మొదలగునవన్నీ మాట వల్లనే సిద్ధిస్తాయి. అందువల్ల పొసగినట్లు చక్కగా పలుకుట లెస్స.



కత్తి, గొడ్డలి మొదలైన ఆయుధములతో తెగనఱకబడిన చెట్టు తిరిగి చిగురిస్తుంది. కానీ మాటలతో చెడిన పనిని తిరిగి సరిచేయటానికి ఎంత ప్రయత్నించినా సాధ్యం కాదు.

శరీరంలో నాటుకొని, విరిగి పోయిన బాణాలను నిపుణతతో (నేర్పు) తొలగించి గాయాలను మాన్పవచ్చునే గాని, మనస్సులో గాఢంగా నాటిన మాటలు ఎన్ని ఉపాయములతోనైనా పూర్తిగా పోగొట్టడం కష్టమే అవుతుంది.

కౌరవేశ్వరా : ధర్మనందనుని నోట ఎప్పుడైనా ఇట్టి పరుష వాక్యం విన బడిందా ? లేదు కదా ! నీ కొడుకులు మాత్రం ఒకరిని మించి మరియొకరు నీచములు, నికృష్టములు అయిన మాటలతో పెక్కు విధముల ప్రేలాపించటం వింటావే కాని, తగదని వారిని వారింపవు. నీకిది ఎంతమాత్రము మంచిది కాదు.

చేటు గాలము దాపురించినప్పుడు చెడు మాటలు, చెడు పనులు మంచివిగా తోస్తాయి. మంచివి, చెడుగా గోచరిస్తాయి. నీ మనస్సు పాండవులతోడి విరోధమును మానుకొనుట కిష్టపడక పోవుట పాపము హేతువు.

మన కులమునందు తేజో, ధైర్య, ధార్మికత్వాది గుణములచే గొప్పవాడైన ధర్మరాజు నీ సికికి వెలియై యుండుట పాడికాదు. ఆతడు నీ పెద్దరికము చూచి నీ కొడుకు చేయు అపరాధములు అన్నింటిని సహిస్తున్నాడు".

ఇది విన్న ధృతరాష్ట్రుడు విదురునితో "నీవు చెప్పిన నీతి వాక్యములచే నా మనస్సుకు తృప్తి కలుగుట లేదు ఇంకను చెప్పుమని అడుగగా, మరల విదురుడిలా చెప్పసాగాడు.

"సకల పుణ్య కర్మచయమును, ధర్మవర్తనమును తుల దూచినచో ధర్మము పక్షముననే మొగ్గు చూపునట్లు వేదములు తెలియజేస్తున్నాయి. ధర్మ నిరతులగు వారికి ఇహలోక ఫలములన్నీ కలుగుటయే గాక కీర్తి కూడా లభిస్తుంది. మానవుడు భూమిపై ఎంతకాలం కీర్తింపబడతాడో, అతడంతకాలం పుణ్యలోక ఫలములు అనుభవిస్తాడు.

పూర్వము ప్రహ్లాదుడు రాక్షస జాతిలో పుట్టిన వాడే అయినప్పటికి తన కుమారుడైన విరోచనుడు, అంగిరసుడనే బ్రాహ్మణుని కుమారుడు 'సుధన్వుడు' తమ తమ ప్రాణములు పందెములుగా పెట్టుకొని, ఒక ధర్మ సందేహమునకై తనయొద్దకు రాగా, మధ్యస్థుడైన అతడు కొడుకను పక్షపాతమును విడిచి, సుధన్వునే గెలిపించాడు. తర్వాత అతని నుండి తన తనయుని ప్రాణములు దానముగా గ్రహించి విరోచనుని బ్రతికించాడు.

ఓ రాజా! ఆ విధంగానే నీవు కూడా అధర్మ పరులైన నీ పుత్రులపై గల పక్షపాతాన్ని విడిచిపెట్టి ధర్మంగా ప్రవర్తించటం మంచిది. ఆ రీతిగా చేసినట్లైతే నీ పుత్రులు సుఖంగా బ్రతుకుతారు. నీవు కూడా శోక విముక్తుడవు అవుతావు.

ఆర్యులైన వారు లేనిది అది సభ కాదు. సముచితంగా ధర్మము పలుకని వారు పెద్దలు కానేరారు. సత్యము లేనిది ధర్మము కానేరదు. తమ ప్రయోజనాన్ని మాత్రమే మనస్సులో పెట్టుకొని చెప్పబడి కడదాక నిలబడలేనిది సత్యమూ కాదు.

నీతి మార్గములో బ్రతుకుట ఉత్తమ పద్ధతి. శౌర్యముచే సంపదలు సంపాదించి బ్రతుకుట మధ్యమ పద్ధతి. ఇతరులకు భారమైన విధంగా బ్రతుకుట అధమము. నీతి బాహ్యులైన వారిని ఉత్తములు ఎన్నడు మెచ్చుకోరు.

నీ కొడుకు లెల్లప్పుడు కయ్యమునకే కాలు ద్రవ్వుతారు. నీ పుత్రుల మంత్రులగు కర్ణాదులు, సహితం యుద్ధానికే పూనుకొంటారు. నీవు కూడా నీతి మార్గంలో ప్రవేశింపవు.

పాండవులు సమర్థులై యుండి కూడా, శౌర్యముల్లక శాంతినే కోరుకొంటున్నారు. సముచితమగు నీతి మార్గముననే అవలంబించి ప్రజల మెప్పు పొందుతున్నారు. వారి శౌర్యాగ్ని విజృంభించినచో దానిని ఎవ్వరును ఆప్పలేరు.

పాండు పుత్రులు నిన్ను తమ తండ్రితో సమానముగ గౌరవించి, భక్తితో ప్రవర్తిస్తూ, సజ్జన నుతమగు ధర్మ మార్గమున నడుస్తున్నారు. కావున నీవును నిర్మల చిత్తమున వారిని కన్న కొడుకులవలె సంరక్షింపుము.



అవ్యాజమగు ప్రేమతో పరోపకారము చేసేవారే ఇతరుల కాధారము. ఒకరి వలన సహాయాన్ని పొంది, ఉన్నతినిచెంది, సంపదలు సంపాదించి, తన కట్టి మేలు చేకూర్చిన వారికి కీడు కల్గించే వాడు కృతఘ్నుడని పిలువబడతాడు. అట్టివాని కళేబరము కుక్కలు కూడా ముట్టుకునేందుకు ఇష్టపడవు. చేసిన మేలు మరువకుండుట (కృతజ్ఞత) ఉత్తమ లక్షణము. నీకు పాండురాజు పరమ భక్తుడు. పాండవులు కూడా నీకు అనేకములైన తేజోలాభములు సమకూర్చి పెట్టారు. కావున నీవును పాండవులను ఆదరింపుము.

జీవితమున బాగుపడుట, చెడిపోవుట, నిందలనుభవించుట, ప్రశంసలందుకొనుట, ఇచ్చుట, వేడుకొనుట మొదలగు సుఖ దుఃఖాలు ఎన్నో కలుగుతాయి. వానికై చింతింపరాదు. చింత వలన ప్రాణులకు బలం తగ్గుతుంది, రూపు చెడిపోతుంది, మతి తప్పుతుంది, రోగం వస్తుంది. చింతచే కృశించినచో శత్రువులు సంతోషిస్తారు. కావున వగపు మానుము." అనగా విని ధృతరాష్ట్రుడు-

"మహామంత్రీ! మొదటి నుండీ ఉత్తముడగు ధర్మజుని నేను రిక్త ఉపచారములతో ఉడికించాను. ఇంక ఆ నెవ్వగ ఉపశమించే ఉపాయమేదో చెప్పుము"ని అడిగాడు. అప్పుడు విదురుడు "మహారాజా! నియతమగు తపము, ఇంద్రియ నిగ్రహము, ఉత్తమ విద్య, లోభమును విడిచి పెట్టుట అనునవి శాంతికి కారణములు. దాయాదులు పరస్పర సహాయంతో, ప్రేమతో కలిసిమెలసి ఉన్నప్పుడే తామర తంపరగా వృద్ధిపొంది సిరి సంపదల కాటపట్టయి నిల్చెదరు.

ఒంటరిగా ఉన్న చెట్టుకు ఏనుగు, గుఱ్ఱము మొదలగు జంతువుల తాకిడి చేత గాని, గాలి చేతగాని పతనము తప్పదు. గుంపుగా ఉన్న చెట్లకు ఏ విధమైన బాధా ఉండదు. కావున కౌరవులు, పాండవులు ఒకరి కొకరు సహాయంగా ఉంటే వారి నెవ్వరు జయింపజాలరు సరిగదా! తేరిపాఱ చూచేందుకు కూడా సాహసించలేరు. శత్రువుల సంఘర్షణ లేని రాజ్యం సుభిక్షమై, మహిమాన్వితమై విల్లసిల్లగలదు.

వనవాస క్లేశములను అనుభవించిన పాండవులను వెంటనే ప్రీతితో రావించి, వారికి ఉచితమైన స్థానమిచ్చి, నిలుపుకొనుట నీవు నీ కుమారులను నిలుపుకొనుటయే అవుతుంది.

లోకంలో ఎక్కడైనా ప్రియమైన మాటలు పలికేవారు ఉంటారేకాని, అప్రియమైనప్పటికి హితము పల్కెడు వారు అరుదు. జూద మాడేటప్పుడే అది తగదని అడ్డుపడి వారించిన నా పలుకులు రోగికి పథ్యమువలె నీకు రుచింపలేదు.

కాకులను గైకొని మయూరములను (నెమళ్ళు) పరిహరించినట్లు, పిల్లులను బట్టుకొని, సింహములను అనాదరించినట్లు నీవు దుర్యోధనాదులను చేబట్టి ధర్మరాజాదులను విడిచి పెట్టావు. నేడు పరిస్థితి విషమించి పైబడిన విప్పుడు దిక్కుతోచక తల్లడిల్లి పోతున్నావు.

కులమును కాపాడుకొనుటకు ఒక్కని విడిచి పెట్టుటయే నీతి. దుర్నయపరుడై హితమును వినన్నొల్లని సుయోధనుని విడిచి పెట్టిన నేమి ? సంపద సహాయము నపేక్షించును. సహాయము సంపద నుద్దేశించి ప్రవర్తిల్లును. ఇవి పరస్పరాశ్రయములు. నీ సంపద పాండవులకు, వారి సహాయము నీకు, ప్రియము కలిగింపగా వారును వీరును కలసి యుండుట మేలు.

"కురువంశ వర్ధనులగు భీష్మ, యుధిష్ఠిరులును, నిర్వక్ర పరాక్రములగు కర్ణార్జునులును, ప్రతాప నిలయులగు భీమ, దుర్యోధనులును, శస్త్రాస్త్ర పారంగతులైన అభిమన్యు లక్ష్మణ కుమారులును, శాపానుగ్రహ సమర్థులగు ద్రోణ, ద్రుపదాది పరమాప్తులను వారివారి బంధుమిత్ర జనంబులొక్కటై నీ ఆజ్ఞ పాటించుచు, నయ విక్రమములు అప్రతిహతములై యుండ భూమిని శాసించు నీవిభవ ముజ్వలమై పరుల కవకాశ మీకుండ చెల్లుచుండుట ఎంత బాగుండునో ఆలోచింపుము. పాండవులు ధీరులై వైరము మాటెత్తక యూరకుండినను కొన్ని దినములలో చీకాకుపడి నీ రాజ్య వైభవము చెడిపోవునే గాని దుర్యోధనునిచే భూపరిపాలనా భారము నిర్వహింపబడదు.

దేవా ! జ్ఞాతులు గుణ హీనులైనను విడువరాదు. అట్టిది గుణ సంపన్నులై నీయనుగ్రహము కోరుచున్న పాండవుల నెన్నడు విడువ దగదు. నామాట వినుము. వారల జీవనమునకు కొన్ని ఊళ్లైనను, దుర్యోధనుని ఒడంబరచి ఇచ్చుట లెస్స. నీ యుపేక్షచే పశ్చాత్తాపము పుట్టును. అప్పుడు దానికి ప్రతీకారము లేదు. కావున నీవు అన్ని విధముల పాండవులతో సంధి చేయవలయును.



శరీరము వ్యాధి, జరాదులచే నశించుట సహజము. అట్లని తమతో పాలు పంచుకొనుటకై యుద్ధము చేసి మరణించుట తగునా ? మహా వైభవముతో తులలేని సంపదలతో నొప్పిన రాజు లెవ్వరైన శాశ్వతముగ భూమిపై నుండిరా ? కాన నా మాట వినెదవేని ఇహపర సంపదలకు, కీర్తికి నిలయుడవై విరాజిల్లెదవు".

అని చెప్పగా విని, ధృతరాష్ట్రుడు విదురునితో "నీ మాటలతో నా మనస్సు కలక దీరింది. నీవు చెప్పినట్లే చేస్తాను. నీవు నిర్మలములగు మాటలలో ధర్మపథమును, నీతి తత్త్వమును తెలియజెప్పావు" అని పలికి పరమార్థ దృష్టి కలిగెడు వాక్యములను చెప్పమని కోరాడు.

విదురుడందుకు సమాధానంగా "నాకు తెలిసిన విషయం చెప్పాను. మిక్కిలి రహస్యములైన అర్థములను బోధించుటకు సనత్సుజాతుడే సమర్థుడని చెప్పి, వానిని ప్రార్థించాడు. అతడు ప్రత్యక్షమై ఆ పరమార్థమును ఉపదేశించాడు.



సాత్యవతేయ విష్ణుపద సంభవమై నిబుధేశ్వరాబ్ధి సం్ధ
త్యవ శోభితంబయి జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము నిరంతర సంతత పుణ్య సంప దు
న్నత్యభివృద్ధి సేయు విని నం గొనియాడిన నెల్లవారికిన్. (నన్నయ్య)

ధర్మమరసి, పూని, ధర్మరాజాదులు
నిర్మలంపు కీర్తి నిలుపు కొనిరి
ధర్మమే నృపులకు తారక యోగంబు
విశ్వదాభిరామ వినుర వేమ !

రాముడొకడు పుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులముఁ జెరిచె
నిలను పుణ్యపాప మీలాగు గాదొకో
విశ్వదాభిరామ వినుర వేమ !

# భగవద్గీత - సామాజిక సందేశం

శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తి
చరిత్రోపన్యాసకులు
మాతృశ్రీ ఓరియంటల్ కళాశాల
జిల్లెళ్ళమూడి.

మానవ జీవితాన్ని సరైన దారిలో నడిపించడమే మహర్షుల లక్ష్యం. మానవుణ్ణి తీవ్రంగా ప్రభావితం చేసేది అతని హృదయం. మానవుల మనోధర్మం ఏ కాలంలో అయినా ఒక్కటే. మానవ హృదయంలోని ప్రేమ, అనురాగము, క్రోధము, భయము వంటి భావాలు కాలానికీ కాలానికీ మారవు. కాలంలో వచ్చే కొద్దిపాటి మార్పులవల్ల బహిః స్వరూపం కొంత మారుతుందేమోగాని, హృదంతరాళంలో మాత్రం చెప్పుకోదగిన మార్పంటూ ఉండదు. సంఘంలోని మానవుల మధ్య శాంతియుత సహజీవనానికి కావలసిన ధర్మాలు సర్వసాధారణంగా అన్ని కాలల్లోనూ ఒకే రీతిలో ఉంటాయి. క్రాంతదర్శి అయిన మహర్షి మానవ మనస్తత్త్వాన్ని సునిశితంగా పరిశీలించి, మానవ జీవితంలో నిరంతరమూ జరిగే పోరాటాన్ని సమీక్షించాడు. జీవిత సంగ్రామానికి ప్రతీక భారత యుద్ధం. భారతానికి హృదయం 'భగవద్గీత'. అర్జునుడు యుద్ధ రంగంలో ధర్మాధర్మాలకు బదులు బంధుమిత్రులను చూశాడు. అయిన వారిని చూసి మోహపడి, విషాదం చెంది, ధర్మ సమ్మూఢ చేతస్కుడయ్యాడు. గీతా ప్రబోధానికి భారత యుద్ధం కేవలమూ నిమిత్త కారణమే. అహంకార మమకారాల కారణంగా కర్తవ్యతా విముఖుడైన సామాన్య మానవుడికి సంకేతం అర్జునుడు. హృదయ దౌర్బల్యం మానవుడి కర్తవ్య నిష్ఠను దెబ్బ తీస్తుంది. కర్తవ్యానికి హృదయ దౌర్బల్యానికి సంఘర్షణ ఏర్పడుతుంది. ఈ సంఘర్షణకు సాహిత్యంలో కల్పించే సంకేతం సంగ్రామం. తనలోని ధర్మా ధర్మాలకు ఘర్షణ జరుగుతున్నప్పుడు అధర్మమని తెలిసి కూడా - ఆ అధర్మాన్ని శిక్షించడానికి ఉద్యుక్తుడు కాలేని మానవుడికి కర్తవ్యబోధ అవసరం కదా! అందుకే, "క్షుద్రం హృదయం దౌర్బల్యం త్యక్త్వా - ఉత్తిష్ఠ!" అని జాగృతం చేస్తోంది గీతావాణి.



గీతా ప్రబోధం వినక ముందు అర్జునుడు 'నరుడు'. విన్న తరువాత 'విజయుడు'. కర్తవ్యాన్ని విస్మరించి విషాదంలో మునిగిపోతే - నరుడు - కర్తవ్యాన్ని నిర్వర్తించ గలిగితే - విజయుడు. నరుడు విజయుడు కావడానికే భగవద్గీత. కార్య సాధనకు చాలినంత మనస్థైర్యం లేని వారికి ధైర్యాన్ని ప్రసాదించి, కార్యోన్ముఖులను చేసే సమర్థత గీతా శాస్త్రానికి ఉంది.

మహాభారతం మానవ జీవితాన్ని రెండు దశలుగా చూపిస్తోంది. మొదటిది వ్యక్తిగత జీవితం. రెండోది సామాజిక జీవితం. మానవుడు తన జీవితంలోని ఈ రెండు పాత్రలనూ ధర్మబద్ధంగా నిర్వహించుకోవాలి. వ్యక్తిగత జీవితం సామాజిక జీవితానికి దీప్తిని కలిగించేదిగా ఉండాలి. అలా ఉండడానికి కావలసిన అన్ని మార్గాలనూ వివరిస్తోంది భారత హృదయమైన భగవద్గీత.

మానవుడు నిస్సహాయుడు కాగా, దైవమే అండగా నిలిచి, వెన్నుతట్టి ప్రోత్సహించిన ధర్మ ప్రబోధమే భగవద్గీత. మమకారం మనోవ్యాకులతను కలిగించగా కర్తవ్యతా విముఖుడయ్యాడు అర్జునుడు. 'కార్పణ్య దోషో పహత స్వభావుణ్ణి'ని స్వయంగా చెప్పుకున్నాడు. అటువంటి అర్జునుడు - తనకు కర్తవ్యం బోధించమని సర్వ సమర్థుడైన కృష్ణుణ్ణి కోరడం విడ్డూరం కాదు. అనాదిగా మానవుడు దైవంతో ఇలాగే అనుబంధం పెంచుకున్నాడు.

పెద్దలను గౌరవించి, వారి ద్వారా కర్తవ్యం తెలుసుకుని పాటించడం - జీవితంలో బాగుపడాలనుకున్న వాడికి సహజమే కదా! యోగ జీవితమూ, అందుకు కావలసిన సాధన క్రమమూ గీతాచార్యుని బోధలో చక్కగా కన్పిస్తాయి. మానవుడిపై మనస్సు ప్రభావం ఎక్కువ కదా! చంచలమైన మనస్సును అభ్యాస వైరాగ్యాలతో దారికి తెచ్చుకోవాలని, అలా తెచ్చుకోవడానికి తనకు నచ్చిన మహానుభావులను ఆదర్శంగా ఎంచుకోవాలని - అంటాడు కృష్ణుడు. ఆదర్శంగా ఎంచుకోవడం అంటే పూజించడం మాత్రమే కాదు, వారిని అనుసరించి ప్రవర్తించడం. అలా అనుసరింప దగినవారే గురువు లేక ఇష్టదైవం. మనకంటె ముందు పుట్టిన వాళ్ళు మనకు భౌతికమైన జన్మను ఇవ్వగలిగినట్లే, మనకంటె ముందు యోగ జీవితంలో స్థిరపడిన జ్ఞానులు మనకు యోగ జీవితాన్ని ప్రసాదించగలరు. ఇలాంటి యోగ జీవితాన్నే 'రెండవ జన్మ' అని కూడా అంటూ ఉంటాము. అదే 'ద్విజత్వం'. మహనీయుల

సన్నిధిలో చేరి, వారిని అనుసరించాలనుకున్నప్పుడు క్రమంగా వారిలో తన ప్రతిబింబం దర్శనమిస్తుంది. 'ఆదర్శం' అంటే అద్దం. అద్దంలో చూసి తన రూపురేఖలను సరిదిద్దుకున్నట్లు - ఎవరిని ఆదర్శంగా ఎంచుకుంటామో - వారితో పోల్చుకుని తన జీవితాన్ని తాను దిద్దుకునే అవకాశం లభిస్తుంది. ఇలా దిద్దుకునే వేళలో మానవుడికి రెండు ప్రధానాంశాలు గోచరిస్తాయి. మొదటిది సమదర్శనం, రెండవది కర్మాచరణలో కౌశలం.

మిత్రులుగా, శత్రువులుగా ఉదాసీనులుగా, తటస్థులుగా, బంధువులుగా, మంచివారుగా, చెడ్డవారుగా కన్పించే అందరిలోనూ ఒకే సత్యం సాక్షాత్కరించడం సమదర్శనం. సమదర్శి తనకు ఎదురైన సన్నివేశాలపట్ల ఒక న్యాయమూర్తిలా ప్రవర్తిస్తాడు. చెడుకి శిక్షణ, మంచికి రక్షణ కల్పిస్తాడు. కాని అతని మనస్సుకి ఆ సన్నివేశాలేవీ అంటుకోవు. ఈ విధమైన సమదృష్టితో యోగి నుంచి విధి నిర్వహణ జరుగుతూ ఉంటుంది.

ఇలాంటి సమదర్శనమే కర్మాచరణలో కౌశలాన్ని ఇస్తుంది. యోగి లేదా జ్ఞాని తనలో వ్యక్తమవుతున్న స్వభావాన్ని, ఆ స్వభావాన్ని అనుసరిస్తున్న గుణకర్మలను దర్శిస్తాడు. తామరాకుపై ఉన్న నీటి బొట్టు దానికి అతుక్కోని విధంగా ప్రపంచంలో తన కర్తవ్యం నిర్వర్తిస్తూనే ప్రాపంచిక వ్యామోహంలో పడకుండా ఉండగలుగుతాడు. ఇలా సమదర్శనం, కర్మాచరణ కౌశలం కలసి మానవుడు మహానుభావు డవుతాడు.

సాధారణంగా నిత్య జీవిత సన్నివేశాల నిర్వహణ వేరు. ఆధ్యాత్మిక సాధన వేరు అనే భావం మనలో చాలా మందిలో ఉంది. కాని, జీవితంలో ఎదురయ్యే సన్నివేశాలన్నీ మానవుడికి శిక్షణ అందించడానికే అని, అవే సాధన మార్గాలు అని నిరూపిస్తోంది భగవద్గీత. ఆధ్యాత్మికత పేరిట నిత్య జీవిత నిర్వహణ నిపుణతను అందించి, వ్యక్తిని సంస్కరించి, సమాజాభ్యుదయానికి అనువైన రీతిలో మలచి, మహోన్నతుణ్ణి చేసే విద్య ఇది.

నిత్య జీవిత నిర్వహణలో మానవుడి మనస్సుకి చాలా ప్రాధాన్యం ఉంది. మనస్సు ఇంద్రియాలవైపు మొగ్గితే అధర్మం. బుద్ధిచేత నడిపించబడితే ధర్మాచరణ. మనస్సు ఇంద్రియాలవైపు జరిగిపోవడమే సంసరణం - 'సంసరణం' అంటే జరిగిపోవడం అని కదా ! అర్థం. సంసరణమే సంసారం. ఇలా జరిగిపోతే, ఆ మనస్సుకి



తెలివికి పొరలు కమ్ముతాయి. అలాంటి మనిషి తాను పతనమై పోవడమే కాకుండా, తన తోటి వాళ్ళను హింసించి, సమాజంలో అశాంతిని రగిలిస్తాడు. ఇలాంటి స్థితిలో, ఉన్న మనస్సు గల వ్యక్తుల ప్రవర్తన కారణంగానే ఈ నాటి సమాజంలో జరుగుతున్న ఎన్నో అవాంఛనీయ సంఘటనలను, అమానుష కృత్యాలను, ఘోరాలను, నేరాలను అను నిత్యమూ వార్తా పత్రికల్లో మనం గమనిస్తూనే ఉన్నాం. అందుకే, మనస్సును, మనిషిని సంస్కరించకుండా ఏం చేసినా సమాజ సముద్ధరణ అమలులోకి రాదు. ఈ దృక్పథంతో వ్యక్తి సంస్కరణకు పూనుకున్న గ్రంథం 'భగవద్గీత'.

జనన మరణాలు ప్రకృతి సిద్ధమైనవని, అపరిహార్యమైన ధర్మానికి శోకించడం తగదని అర్జునుణ్ణి యుద్ధానికి ప్రోత్సహించాడు శ్రీకృష్ణుడు ఇలాంటి బోధ వల్ల అలవడేది వైరాగ్యమే కాని, నిర్వేదం కాదు. కర్తవ్యం నుంచి పారిపోవడం కాదు. నిర్వేదం అసలే కాదు. కర్తవ్య నిర్వహణ కోరికలతోనూ పట్టుదలతోనూ కాక - సమదృష్టితోనూ ధర్మదీక్షతోనూ జరగాలన్నదే గీతాచార్యుని ఆశయం.

యుద్ధరంగంలో ప్రవేశించిన అర్జునుడు మమకారంతో మనస్సు వికలమై-గాండీవాన్ని జారవిడిచి, చతికిల పడ్డాడు. అతన్ని కర్తవ్యం వైపు మరలించడానికే కృష్ణుడు చేసిన గీతోపదేశం. కృష్ణుడు పూనుకోకపోతే, అర్జునుడు నవ్వుల పాలయ్యేవాడు. గాండీవాన్ని జారవిడిచిన అర్జునుణ్ణి చూసి-కౌరవులు అతనికి వైరాగ్యం ఒంటపట్టిందని భావించారు సరికదా ! పిరికితనం అబ్బిందని గేలి చేస్తారు. వాళ్ళ హేళనకు తట్టుకోలేక అర్జునుడు కోపం వచ్చి యుద్ధం చేసి ఉండేవాడు. ఎలాగూ యుద్ధం చేయడం తప్పేది కాదు; కోపంతో యుద్ధానికి దిగటం కన్నా, ధర్మాన్ని గుర్తించి కర్తవ్య దీక్షతో యుద్ధం చేయటం మంచిది కదా ! వ్యక్తిగతమైన మాట పట్టింపులతో కోపతాపాలతో, చిర్రుబుర్రులతో, రాగ ద్వేషాలతో కుతకుతలాడే మనస్సుతో కర్తవ్య పాలనకు పూనుకుంటే, కర్తవ్యానికి బదులు చేయరాని పనులు చేసే ప్రమాదం ఉంది కట్టెలు కొట్టేవాడు చిరాకుతోనో, పరాకుతోనో ఆ పని చేయబోతే, కట్టెమీద వేయబోయిన గొడ్డలిని కాలిమీద వేసుకుంటాడు. అందుకని కర్తవ్యం తీరు తెన్నులను, అందులో ఉన్న ధర్మాన్ని గుర్తించడం ఎంతైనా అవసరం. అలా గుర్తింపచేసేదే 'యోగం' లేక 'జ్ఞానం'.

గీతా ప్రబోధం ద్వారా జ్ఞానం పొందిన అర్జునుడు, కృష్ణుడి రూపంలో వ్యక్త మవుతున్న పరమ ధర్మానికి తన్ను తాను సమర్పించుకుని కర్తవ్యాన్ని పాటించాడు. జ్ఞానం పొందడంతో కర్తవ్యం ప్రారంభమవుతోందేగాని ముగిసిపోవడం లేదు. కాబట్టి గీతా సంపుటాల పుటలు తెరవాల్సింది జీవిత చరమ సంధ్యలో కాదు, జీవితారంభ దశలోనే అని మనం గుర్తించాలి.

అసలు, కర్మలను ఆచరించకుండా మానవుడు ఒక్క క్షణమైనా ఉండలేడు. "నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్య కర్మకృత్" అని కర్మ యోగం. అందుకే, కర్మాచరణం విడిచిపెట్టడం కాదు, కర్మఫల త్యాగమే కర్మ సన్న్యాసం. ఫలితాన్ని ఆశించకుండా కర్తవ్య నిష్ఠతో మానవుడు కర్మలను ఆచరించాలి. "కర్మణ్యేవాధి కారస్తే - మా ఫలేషు కదాచన" అని గీతా వాక్యం.

ఆధునికులు సామ్యవాద సిద్ధాంత వ్యవస్థను సమర్థిస్తారు. ఆస్తి హక్కు ఉండరాదని, వస్తూత్పత్తి వల్ల వచ్చే లాభం వ్యక్తులకు కాక, ప్రభుత్వానికే చెందాలని, అప్పుడే సమ సమాజ వ్యవస్థను స్థాపించగలమని సామ్యవాద సారాంశం. భగవద్గీత చెప్పే కర్మఫల త్యాగం కూడా ఇటువంటిదే. ఫలితం తనది కాదు కాబట్టి కర్మాచరణలో నిరాశకు, దురాశకు లోనుగాకుండా సమభావంతో ప్రవర్తించ గలుగుతాడు. మానవుల మధ్య ఈ విధమైన సమదృష్టి ఏర్పడినప్పుడు స్వర్గతుల్యమైన సమాజాన్ని స్థాపించుకో గలుగుతారు

కార్యసిద్ధి, కార్య విఫలతల పట్ల సమభావము, ఫలత్యాగ బుద్ధితో కర్మాచరణం చేసే కౌశలము యోగమని గీతాచార్యుడు వివరించాడు. "సమత్వం యోగ ఉచ్యతే"- "యోగః కర్మసు కౌశలం" - అంటూ - "యోగస్థః కురు కర్మాణి" అని ఆదేశించాడు. "యోగివై కర్మాచరణ ప్రారంభించు" అనడంలోని అంతరార్థాన్ని గుర్తించిన కొద్దీ యదార్థం గోచరిస్తుంది.

హృదయ ధర్మానికి కట్టుబడి ప్రవర్తించడం మానవుని సహజ లక్షణం. అలా ప్రవర్తించే మానవుడు జీవితంలో ఎక్కడైనా తప్పటడుగువేసే అవకాశం లేక పోలేదు అందుకే, ఆత్మ సంయమనం అవసరమన్నాడు గీతాచార్యుడు. నిగ్రహం చాలక, ఎవరైనా తప్పు చేస్తే జీవితం పాపపంకిలమై పోయిందని నిస్పృహ చెంద



నక్కర లేకుండా - సర్వాంతర్యామిని ఆశ్రయిస్తే దుఃఖ విముక్తి సాధ్యమవుతుందనే ప్రబోధం ఎంతైనా అవసరం. అందుకే, "సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణం వ్రజ" అన్నాడు శ్రీకృష్ణుడు

సర్వాంతర్యామిని ఆశ్రయించడం అంటే సమాజ రూపంలో ఉన్న సర్వేశ్వరుడికి తన్ను తాను సమర్పించుకోవడం. పశ్చాత్తప్త హృదయుడై పునీతుడు కావడం. ఇలా శరణాగతి ద్వారా ఉత్సాహాన్ని పొంది, మానవుడు కర్మ యోగా భ్యాస కుశలుడై కర్తవ్య నిర్వహణ సామర్థ్యాన్ని పెంచుకుంటాడు.

అయితే, గీత వివరించిన ఆధ్యాత్మిక సాధనలను స్వార్థపరులెవరైనా కొందరు స్వప్రయోజనాల కోసం వినియోగించవచ్చు అందుకే, పెద్దల ప్రబోధం కాక ఆచరణను ఇతరులు అనుసరిస్తారని భగవద్గీత చెప్తోంది." యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః". పెద్దలు సత్ప్రవర్తనను పాటిస్తే, పిన్నలు వారి అడుగు జాడల్లో పురోగమిస్తారు. ఇలా తరతరాలకూ అవిచ్ఛిన్నంగా ముందుకు సాగే ఈ సత్సంప్రదాయం సంఘమంతటికీ సంస్కృతి పరమైన సత్తువను, నైతిక బలాన్ని ఇస్తుంది. భావి పౌరులు మంచి నడవడి గలవారై, సంఘాన్ని ప్రగతి మార్గంలో నడిపించ గలుగుతారు.

ఆధ్యాత్మిక సాధనకు గీతాచార్యుడు నిర్దేశించిన ధర్మ సముదాయం మానవ సంఘంలో నైతిక విలువలను, మానవునికి చిత్త శాంతిని ప్రసాదించగల మహౌషధం. అందుకే, దాన్ని "ధర్మామృతం" అన్నాడు. 'భక్తుడే తనకు ప్రియుడ'ని భక్తి యోగంలో ప్రత్యక్షంగా చెప్పాడు. "యో మద్భక్తః సమే ప్రియః" అంటూ భక్తుడి లక్షణాలను వివరించాడు. "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ" అని ప్రారంభించాడు. సమదృష్టి, సహన శీలము, ఆత్మ నిగ్రహము, సర్వభూతదయ మొదలుగా గల ఉదాత్త మానవ ధర్మాలను పేర్కొన్నాడు. సాంఖ్య యోగంలో స్థితప్రజ్ఞుడు కాగల మానవుడే ఉత్తముడని పేర్కొంటూ ఈ లక్షణాలనే వివరించాడు. దైవాసుర సంపద్విభాగ యోగంలో కూడా సత్ప్రవర్తనకు కావలసిన ధర్మాలను దైవీ సంపత్తుగా అభివర్ణించాడు. "మానవసేవే మాధవసేవ" అనే భావాన్ని పాదు కొల్పుతూ - సత్ప్రవర్తనలో నుంచి దివ్యత్వాన్ని అందుకునే మార్గాన్ని భగవద్గీత సూచిస్తోంది.

మానవుణ్ణి పతనావస్థకు దిగజార్చే అధార్మిక ప్రవృత్తి సంఘానికి కూడా చేటు కలిగిస్తుంది. అందుకే, గుణత్రయ విభాగ యోగంలో అలాంటి ప్రవృత్తిని తమో గుణంగా పేర్కొంటూ, 'అది' పనికిరాదని వివరించాడు. తపస్సును కూడా నైతిక పవిత్రత కోసమే గీతాచార్యుడు నిర్దేశించాడు. పెద్దలను గౌరవించడం, సత్ప్రవర్తన, అహింస శారీరక తపస్సు అని, ఇతరుల మనస్సును నొప్పించకుండా సత్యము, ప్రియము, హితము అయిన సంభాషణ సాగించడం వాక్కునకు తపస్సు అని, ప్రసన్నమైన అంతఃకరణంతో సౌమ్య స్వభావంతో కూడిన ఆత్మ నిగ్రహమే. మానసిక తపస్సు అని శ్రద్ధాత్రయ విభాగ యోగంలో భగవానుడు చెప్పిన మాటలను ఈ సందర్భంలో మననం చేసుకోవలసిన అవసరం ఉంది.

"సాటి ప్రాణులను నీ వలెనే చూడు" అనేది దేశకాలాంతో నిమిత్తం లేకుండా అందరికీ అన్ని వేళలా పాటింపదగిన ఉత్తమోత్తమ ధర్మం కదా ! ఆత్మ సంయమ యోగంలో

"సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగ యుక్తాత్మా సర్వత్ర సమదర్శినః ॥"

అని విశ్వమానవ ప్రేమను ప్రబోధించాడు శ్రీకృష్ణుడు.

### కర్మసన్న్యాస యోగంలో కూడా

"విద్యా వినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥"

అని - ఈ సమదర్శనాన్నే ఉద్బోధించాడు. అంటరానితనమనే సామాజిక జాడ్యాన్ని ఇంకా వదిలించుకోలేని ఏ సమాజమైనా, ఈ గీతాధర్మం పట్ల మేల్కొనక తప్పదు.

సాంఘికమైన అశాంతికి కారణం స్వార్థపరత్వం, సంకుచితత్వం, సమభావం లోపిస్తే అశాంతి తప్పదు. సమదృష్టి విశ్వశాంతికి మూలం. అహంకార మమ కారాలకు అతీతమైన విశ్వమానవ ప్రేమ ఒక మహా చైతన్య స్రవంతిగా మానవాంత రంగాల్లో నుండి పొంగి పొరలితే గాని, శాంతియుత సహజీవనం సాధ్యపడదు సంఘంలో శాంతియుత సహజీవన వికాసానికి రాచబాట గీతాధ్యయనం.



# మహాభారత భూమిక

డాక్టర్. సి.యస్. శాస్త్రి ఎం.ఏ; పి.హెచ్.డి.
ప్రిన్సిపాల్
యస్. వి. యస్. ఓరియంటల్ కాలేజి, తణుకు.

మానవులు అందరు సర్వజ్ఞులు కారు. కొంతమంది విజ్ఞులు మరికొంత మంది అల్పజ్ఞులు కావచ్చు. ఈ ప్రపంచములో అఖండమైన జ్ఞానం కలిగి ఉండటం జీవుడుకి సాధ్యం కాదు. అందుకే ఒక కవి "సర్వజ్ఞ నామధేయం శర్వునకేచెల్లు అని చెప్పినాడు. అంటే ప్రతి వ్యక్తికి ఎంతటి పరిజ్ఞానము కలవానికైనను, ఏదో కొంత తెలియనిది మిగిలే ఉంటుంది. ఎన్ని గ్రంథములు చదివి, ఎంత లోక మెరిగి ఎంతటి పరిజ్ఞానము నెంతటి అనుభవమును గడించినను, ఏ విషయము నందో అజ్ఞానపు తెర ఆవరించి ఉండును. తెలియని దానిని గురించి మానవులు భయమునో, భక్తినో అలవరుచుకొనుటకు సాధారణముగా అలవాటు పడియున్నారు. తెలిసిన విషయము లందు కూడా భయము కలుగుట కలదు. అనగా, పరొక దాని వలన తనకు హానియో, అపకారమో కలుగునని తెలియుట భయహేతువగునన్న మాట. కాని తెలియని దానిని గురించి భయము కలుగుటలో ఒక చమత్కారము ఉన్నది. తెలియని దాని వలన ఉపకార అపకార విషయములో నిర్ణయము లేదు. వాటి స్వరూపము తెలియదు. ఏల భయపడవలయునో తెలియదు. భయపడకున్ననేమి ? ఏమగునో తెలియని మరొక భయము. ఈ ఇటువంటి నిరంతర భయాస్పదమైన జీవ విక్షేపము నుండి భక్తి అంకురించినది. ఈ భక్తిని అనేక విధములుగా అభివర్ణించినారు. భజించుట భక్తి అందుము. భజించుట అనగా సేవించుట, కొలుచుట, ఉపచరించుట, పూజించుట, స్తుతించుట, ప్రియముగ మాటలాడుట, అనుకూలముగా ప్రవర్తించుట మొదలైన భావములన్నింటికి అనుస్యూతముగా ఆధారమైన మానసిక స్నిగ్ధ భావన. ఎవరిని భజింపవలయునో, ఎందుకు భజింపవలయునో తెలియుచున్నప్పుడు భక్తి స్పష్టముగా గోచరించును. తెలియని తనమున కేవలము ప్రపణత్వమునందే భక్తి ఒదిగి యుండును.

సాధారణముగా ప్రతి వానికి తానధిగమించలేని, ఇదమిత్థముగా నిరూపింపలేని, తాను జయించలేని శక్తి కలదని తెలియును. ఆ శక్తి ఎట్టిదో తెలియదు. ఈ తెలియనితనము నుండే వెనుక చెప్పిన భయభక్తులు కల్పింపబడుచున్నవి. ఈ రెంటి మధ్య నుండి మానవుని అన్వేషణ సాగుచున్నది. ఈ రెంటి వలన మానవుడు క్రమోక్షణకు లోనగుచున్నాడు. ఈ క్రమోక్షణకు వేదశాస్త్రములు మార్గదర్శకముగా నున్నవి. శమదమాదులు, యమనియమాదులు, ఈ మార్గము నందలి సోపానములే. ఇట్టి వ్యాకృతి వలన కొంత చిత్తస్థైర్యం కలిగినది. కాలము గడుచుచున్నది ప్రపంచము నడుచుచున్నది. అజ్ఞాతమైన భయము వలన ప్రత్యక్ష ప్రమాదములు కానరానంత వరకు భయము భ్రాంతి అనిపించినది. తనకున్న తెలివితేటలతో, శక్తి సామర్థ్యములతో ఎన్ని ఇబ్బందులలో, ప్రమాదములలో, సమస్యలతో తప్పుకొనగలుగుచున్న మానవునికి మృత్యువు ఒక్కటి అసాధ్యమనిపించినది. ఏ ఉపాయము లేనప్పుడు, వాతపడక తప్పనప్పుడు మరణముకైనను సిద్ధమగు మొండితనము అలవడును. మరణమును కాలధర్మమందురు. ఈ కాలధర్మమున ప్రతి జీవియు ఏనాడో ఒకనాడు మరణించి తీరును. కాని తన దాక వచ్చినప్పుడు, మరణమునకు కొంత వ్యవధి కలుగవలయునను ఆందోళనయే భయమనిపించును. మానవాతీతమగు శక్తి విషయమున, భక్తి కలవారు ఆ శక్తి అనుగ్రహము వలన తామింత కాలము గండములు గడచి యావదాయుః ప్రమాణము గ్రతికితిమని సంతసింతురు. కాని, వారికి కూడా మరణము తప్పనిదగును. తప్పని మృత్యువును గురించి వృథాభక్తి, వృథాభయము నిష్ప్రయోజనములని విస్తృంఖలముగా బ్రతుకుచున్నవారు ఉన్నారు. ఎవరెట్టి వారైనను కాల ప్రవాహము యొక్క వేగమునకు ఒదిగి రూపుమాసి పోవలసినదే. కాలము మాత్రము అప్పటికి, ఇప్పటికి అనంతముగా, గంభీరముగా ప్రసరించుచున్నది.

ప్రవాహమునందు బుద్బుదముల వలె కాలమునందు జీవదశలు పొడమి, సమసి పోవుచున్నవి. ఈ జీవదశలలో నిరంతర పరిణామ రూపములగు భావవికారములు పుట్టి పెరిగి నశించుచున్నవి. ఈ జీవకోటి యంతయు, జంతు జాలమంతయు నశించుటతో ముగియుచున్నది. ప్రతి సృష్టియు లయమునందే పరిపూర్ణమగుచున్నది. ప్రవాహ రూపముగ నున్న జల ప్రకృతియందు, తద్వికారముగా నేర్పడిన బుద్బుదములు నశించినప్పుడు ప్రకృతి రూపమే భావించినట్లు కాలమందు తత్తత్ వికారముల వలన జీవజాలము జన్మించుట వికార(మగును), ముగను, నశించి కాలగతముగ లీనమగుట కాలస్వభావముగను గోచరించును. అందులకే కాళిదాసు "మరణం



ప్రకృతిశ్శరీరిణాం వికృతిః జీవిత ముచ్యతే బుధైః" అని బోధించినాడు. ఈ అదిత్యత్వమే, ఈ అశాశ్వత్వమే మేధావులగు మానవులను శాశ్వత తత్వాన్వేషణవైపు నడిపించినది. "యంవిదిత్వా అతి మృత్యుమేతి, అభయం ప్రతపదం విందతే, అసతోమా సద్గమయ" మొదలైన శృతి వాక్యము లెన్నియో, ఈ అన్వేషణకు వత్తాసు పలుకుచున్నవి. శమదమాది సాధన సంపత్తితో, నిత్యానిత్య వస్తు వివేకముతో బహిరింద్రియముల నిరోధించి, కామక్రోధాదులను జయించి, అంతరింద్రియములను గెలిచి, స్తిమిత గంభీరముగా అంతర్ముఖమగు దర్శనమున ఎందరో మహానుభావులు శాశ్వత స్వస్వరూపానుభూతికై ప్రయత్నించుచున్నారు. ప్రాపంచిక వ్యవహారమునందలి సుఖ దుఃఖాదులు, రోగక్లేశాదులు జీవయాత్ర పరమావధిగా అనుభూయ మానములు అగుచు, జీవభోగముల విషయమున విరక్తిని కలిగించుచున్నవి. నిరంతరాను శీలము వలన ఛిన్నమైన మనస్సు మాట పెగలనంతదాకా తాను ప్రసరింపగలిగినంత దాకా ప్రసరించి, శాంతించి, జ్ఞానమయమై భావించును. ప్రపంచ ప్రబంధ సాహిత్యములందు శాంతరసానుభూతి చరమావధి ఇట్టిది.

ప్రతి జీవికి తన కిష్టమైనది జరుగవలయునని, ఇష్టము కానిది జరుగరాదని అభిప్రాయం ఉండును. ఇట్టిది స్వార్థమగునో కాదో నిర్ణయించుట సాధ్యమా ? ఇది జీవ లక్షణము అయినచో ఇట్టి వానికి స్వార్థపరుడన్న బిరుదము ఎందులకు ? అద్వైత వాదులకు జీవత్వమె సత్యము కానప్పుడు ఇట్టి లక్షణము యదార్థమగునా ? కాకున్నను, అహంతకు, అస్మితకు కూడని ప్రాపంచిక వ్యవహారము లెట్లుండును ? ధర్మ కామాదులయందు వలె మోక్షము నందు ఇచ్ఛ కూడా శాస్త్రములయందు అంగీకరింపబడినది. సాధన చతుష్టయమునందు ఇది కూడా ఒకటి అయినది. అందుకే "కామిగాని మోక్షగామికాడు" అన్నమాట పుట్టిందేమో ! ఈ ఇష్ట ప్రాప్తులకు, అనిష్టపరిహారులకు అనుసరింపవలసిన విధానముల గురించియు, ఆచరింపవలసిన కర్మల గురించియు ధర్మ భంగము లేకుండా నిరూపించినవి వేదములు. అందలి విషయములే మరికొంత వివరించి దేశకాలాదులను, ఆచార వ్యవహార సంప్రదాయములను సవిమర్శకముగా బోధించినవి ధర్మశాస్త్రములు. ఈ అంశములలో ఒక్కొక్కదాని గురించి అందలి గొప్పతనము, ఆచరణీయత్వము ఫలప్రదత్వమును సోదాహరణముగా, కథలు కథలుగా బోధించినవి పురాణములు. ఇట్టి కథలు కొన్ని వేదములందు కూడా కలవు. ఇట్టి కథలందు కొన్ని కొన్ని సూక్ష్మముగా పరిశీలింపవలసి ఉంది. పాపకార్యములలోనే

బ్రతుకంతయు పండిన దుష్టుడొకడు మరణించు సమయమున కుమారుణ్ణి తలచుకొని, తన ఖర్మము కొలది ఆతని పేరు భగవన్నామమైనందున తావన్ మాత్ర విశేషములతో మరణించిన పిదప విష్ణు దూతలంచే సగౌరవముగా వైకుంఠమునకు చేర్చబడెను. మరొక భట్టాచారుడు ఎప్పటివలె ఆనాటి శివరాత్రి, రాత్రియందు ఒక జీర్ణ దేవాలయమున గుడ్డపీలికను నూనెలో ముంచి వెలిగించు కొన్నంత మాత్రమున ఆతని సర్వపాపములు నిర్ధూతములై కైలాసమును చేరెను. అనగా ఒకడు ఎన్ని అకృత్యముల నొనర్చినను, కుమారునకో, మరొక్కరికో, భగవంతుని పేరు పెట్టుకొనినచో ఇక నాతనికి పాప చింత అక్కరలేదనియా ? మరొక్కరు మహాపాతకము లాచరించి ఏ మార్గ మధ్యమముననో నదిని దాటుచు స్నానము చేసినంత మాత్రమున, ఏ దేవాలయమునకో కుడివైపుగా నడిచినంత మాత్రమున, భుజించుటకు ఏమియు లేక ఏ ఏకాదశి నాడో పస్తున్నంత మాత్రము చేత సరాసరి పుణ్యలోకములకు చేరుకొన గలిగినట్లాయెనా ? ఇక ఇన్ని ధర్మ కార్యములు, విధినియమములు వృథా శ్రమములే అగును కదా ? అందు చేతనే ప్రాజ్ఞులు కొందరు ఇట్టి వానిని అర్థవాదములని పేర్కొనిరి. అనగా నేమి, ప్రధానమైన అర్థము యొక్క గొప్పతనమును ప్రతిపాదించుట కొరకు, ఆ గొప్ప తనమునందు శ్రోతలకో, పాఠకులకో మరింత మంచి అభిప్రాయము కల్గించుట కొరకు, చెప్పిన నిదర్శన మన్నమాట. బ్రతికినంత కాలము పరమార్థ చింతన లేని అజ్ఞుడు కూడా ఏ మంచి సమయములోనో యాదృచ్ఛికముగా ఆచరించిన పని తత్తత్ దేశ కాల విశేషముల వలన మహా పుణ్యముగా పరిణమించి ఆతని సద్గతికి కారణమైనదనగా, నిరంతరము సత్ప్రవర్తనతో, సత్సంగముతో, అట్టి సత్కార్యములు అనేకములు ఆచరించిన వారికి ఇంకా పుట్ట గతులుండవని కైముతిక న్యాయమున బోధించుటయే ఈ అర్థవాదములకు ప్రయోజన మందురు. ఇట్టి కథలు పురాణములందెన్నియో కలవు. ఆ కాలమున అనగా పురాణ కాలమున ఇటువంటి గాథలపై సంశయములు కలిగెనో, లేదో తెలియదు. నిస్సంశయముగా ఆదరింపబడుటచే అప్పటి పురాణములు కూడ, పుక్కిటి పురాణములు కాక నేటికిని జనస్మృతి యందున్నవి. నానాటికి ఆయః ప్రమాణము, విద్యా ప్రమాణము, జ్ఞాన ప్రమాణము సన్నగిల్లి విజ్ఞానము వృద్ధి చెందుతున్న కొలది, ఇట్టి విషయములందు అనాదరము కలుగుట కానవచ్చు చున్నది.



మానవులకు అసాధ్యములైన కొన్ని శక్తులను సంపాదించుటకు మంత్ర తంత్రాదులు, మణి యంత్ర ఔషధాదులు కలవన్నది పూర్వము నుంచి ఎరిగినదియే. వీని యొక్క ప్రయోగములలో, పద్ధతులలో అభిధేయములలో నాటికి నేటికి ఎన్నియో వ్యత్యాసములు ఏర్పడినవి. అంతియేకాక, యుగధర్మములను బట్టి కూడా ఆయా ప్రభావములందు తారతమ్యము కూడా కానవచ్చుచున్నది. దీనిని బట్టి బేరీజు వేసికొనినచో ఆనాటి శక్తులు అత్యూహములైనను, ఊహ కందనివి కావు. పురాణశతములైన ఇతిహాసము లెన్నియో అంతో ఇంతో దేశకాల వ్యత్యాసము లున్నను, చారిత్రికులు పరిశోధించిన సత్యములుగనే తోచుచున్నవి. కొన్ని సత్యములైనప్పుడు, మరి కొన్ని అసత్యములగునా ? నాటి కాలమున ఋషి జీవితమును గడిపిన క్రాంత దర్శకులగు వ్యాసాదులు ప్రపంచ ప్రమాణములుగను, మార్గదర్శకములుగను యావత్సర్గము మన గలిగిన పురాణములను అసత్యాంశములలో, అభూత కల్పనలలో చిత్రించి నారనుట అసంగతమె అగును. అలనాటి మానవులందరు అంతటి గొప్పవారు కాకపోయినను గొప్పవారైన కొందరి చరిత్రను మాత్రమే వా రుదాహరణముగా గైకొనియుందురు. మానవుని యొక్క ధర్మాధర్మ ప్రవృత్తులందు మనస్సంకల్పము ప్రధానమందురు. మరి అర్థవాదములలో దాని బ్రతుకేమైనది ? కొందరు అన్ని కథలను ఏ ఆధ్యాత్మిక విషయములతోనో ముడిపెట్టి సమన్వయించి, సమర్థింతురు. రామాయణమున ఆంజనేయుని సీతాన్వేషణమును ప్రాణాయామతత్వ పరముగా అభివర్ణించిరి. భారతమున పంచభర్తృకయగు ద్రౌపది పంచ విషయ పరివ్యాప్తియగు మనఃస్థితికి సంకేతమనిరి. నలోపాఖ్యానమును బ్రహ్మతత్వ ప్రతిపాదకముగా చమత్కరించిరి. ఏ కథ తీసికొన్నను షడ్వింశతి తత్త్వములలో ఏదియోనొకటి. దేనితోనొకదానితో ఎక్కడొనక్కడ సంపదించినట్లు అనిపించును ప్రకృతి వైభవము అట్టిది. ఇది మాత్రమే అందుమా, వ్యక్తుల పేర్లు, స్థానముల పేర్లు, విషయ సందర్భములు అన్ని కూడా ఇట్టి సమన్వయమునకు అనుకూలమైన అర్థముల నిచ్చుటకు అవకాశము కలవిగా గోచరించుట మరొక విచిత్రము. పోనీ ఈ పురాణ గాథలన్నీ అతఃపూర్వ ప్రచలితములై ఋషుల చేత కేవల మితిహాసములుగా ప్రోక్తములైనవేయని సమాధాన పడవచ్చునని అనుకొన్నను, భారత, రామాయణములు అట్టివి కాదు. రచయితకు సమకాలీన సమాజమున, రచయితలు కూడా స్వయముగా పాలుపంచుకొన్న ఇతివృత్తములైనవి. అందుకేనేమో అవ్వి రెండునూ భారతీయులకు మిక్కిలి ఉపాదేయములైనవి.

భారతీయుల ధార్మిక జీవన విధానమంతయు ఒకానొక అచంచల విశ్వాసము నందు ఆధారపడి యున్నది. దానికి కొన్ని కారణములు కలవు.

1) తామనుభవించుచున్న కష్ట సుఖములన్నియు జన్మాంతరములందు తా మొనర్చిన పాపపుణ్యములకు ఫలితములే అను అభిప్రాయము.

2) తామీ జన్మము నందు చేయు కర్మల వలన ఒకానొక అపూర్వమగు పుణ్య విశేషము ఏర్పడునను తలంపు.

3) తాము చేయు పనుల యందు అదృష్ట రూపమున ఏదియో అజ్ఞాతముగా సహకరించుట సర్వ ప్రపంచమునకు సృష్టి స్థితి లయకారుడగు భగవంతుని యందు భక్తి భయాదుల వలన అనుకూలత, ప్రతికూలత-ఆస్పదములగు మనో వికాసములు. తత్తత్ ప్రతీకారములుగా శాస్త్రముల యందు విహితములైన విషయములను అనుసరింపవలయునను సంప్రదాయము.

ఇటువంటి వాటివలన మానవుడు అనేక విషయములలో కొన్నింటికి సరిఅయిన కారణములు తెలిసికొనలేక పోయినను ధర్మమూలమగు వేదశాస్త్రాదుల యందలి విషయములలో ఒక అనిర్వచనీయమగు విశ్వాసము పెంపొందించుకొనుట అభ్యసించినాడు. అట్లే, ఆర్షములగు స్మృతి పురాణముల యందు కూడా విప్రతిపత్తి రహితముగా ప్రవృత్తిని అలవరుచుకొన్నాడు తత్తత్ కర్మాచరణముల విషయమున అట్టి విశ్వాసము లేకున్నచో ఆ క్రియలు ఫలవంతము కానేరవని స్మృతి కర్తలే వక్కాణించినారు. దీనికి భారతమునందే ప్రమాణము కలదు. జనమేజయ మహారాజు తన శరీరము నందలి పొడలవంటి చర్మరోగము నివారింపబడుటకు వ్యాసుని ఉపదేశము మేరకు భారతము నంతను వినుట జరిగినది. భారత శ్రవణము పూర్తి అయిన తర్వాత శరీరమందు మూడు మచ్చలు మాత్రము మిగిలి పోయినవి. అప్పుడు వ్యాస భగవానుడు నీకు భారతగాథలో 3 విషయములందు అవిశ్వాసము కలిగినది. అందుచే, మూడు మచ్చలు మిగిలినవని చెప్పగా అత డవునని వెల్లడి చేసెను.

1) భారత యుద్ధమునందు భీముడు ఆకసమునకు విసరివైచిన ఏనుంగులు ఇప్పటికిని ఆకాశమున పరిభ్రమించు చున్నవనుట.



2) ధర్మరాజు యుద్ధమున మరణించిన బంధుల కందరకు పారలౌకిక కర్మకాండలు నిర్వర్తించుచుండగా ఆ పితురులందరు శరీరధారులై వచ్చి ప్రత్యక్షముగా కవ్యములను స్వీకరించుట.

3) వ్యాసుని వంటి మహానుభావుడు, మహర్షి, శక్తి సంపన్నుడు, వంశకర్తయై కోరి కౌరవ-పాండవులకు నయముననో, భయముననో నచ్చజెప్పి పరిష్కారము చేసియుండినచో ఇంతటి రాజుల క్షయము జరుగక పోయి ఉండుననుట.

ఈ సందర్భములను విన్న వ్యాస మహర్షి అతనికా అనుమానములను సప్రమాణముగా అనుభవమునకు తెచ్చిన వెంటనే ఆతనికి మిగిలియున్న మూడు పొడలు పూర్తిగా పోయినవి.

నారాయణాంశతో వేద విభాగము నొనర్చుటకు అవతరించిన వ్యాసముని అనేకములగు పురాణములు రచించియు తత్సర్వ ధర్మార్థ సమన్వయ రూపముగను పుణ్యశ్లోకులగు నల యుధిష్ఠిరాదుల దివ్య కథానుబంధమున ప్రజాళికను రచించియు శ్రీకృష్ణుని గీతోపదేశమును నిబంధించియు, నరనారాయణుల దివ్యగాథలను పరామర్శించియు, జయమను పేరుతో ఈ భారతమును రచించాడు. సమగ్ర సంగ్రహముగ లక్ష శ్లోకములలో ప్రణీతమగు ఈ భారత సంహిత యందు ప్రతిపాదించని విషయము ఎందును లేదనియు, ఎచ్చటి నిగూఢమైన విషయము కూడా ఇందు పొందు పరుప బడినదనియు అభిజ్ఞుల వాక్సారము. అందులకే వేదములవలె ధర్మమూలమై, కర్మాచరణమున ఉపాసనా విధానమున, జ్ఞాన పథమున అద్వితీయముగా మార్గదర్శకమై, పుణ్యకథా నిబద్ధమైనందున ఈ భారతము పంచమ వేదమైనది.

కథాపరముగ చూచినను బంధుక్షయము వలన నిర్వేదముతో విరక్తుడైన ధర్మజుని యందు నిత్యానిత్య వస్తు వివేకము కలిగి శ్రవణ మననాదులతో చిత్తము దీప్తమై, యోగ సాధనమున లీనమై శాంత జ్ఞానమున విశ్రాంతమైనది. అందులకే, భారతమున శాంతరసము ప్రధానమని ఆలంకారికులు నిర్ణయించినారు. ఇంతటి వాఙ్మయ ప్రపంచమున ధర్మరాజు ఒక్కడే ధీరశాంత నాయకుడని నిర్ధారించినారు.

# మహాభారతంలోని
# ఉపాఖ్యానములు - ఉపదేశములు

మహాభారతంలో ప్రధాన కథతోబాటు, ప్రసక్తాను ప్రసక్తంగా ఎన్నో ఉపాఖ్యానాలు చెప్పబడ్డాయి - అందులో ప్రతి ఒక్కటి ఏదో ఒక విశేష ప్రయోజనాన్ని ఉద్దేశించి కూర్చబడి ఉండటం వలన అది ఆ ధర్మ సూక్ష్మమును వివరిస్తూ, ప్రధానాంశమునకు ఉపబలకంగా ఉండి, కథా పుష్టికి, కావ్య పరిపూర్ణతకు దోహదపడింది. అలాంటి కొన్ని ఉపాఖ్యానములు మనకు ఏమి ఉపదేశిస్తున్నాయో ఇప్పుడు సంగ్రహంగా తెలుసుకొందాం.

1) కష్టపడి పని చేయటం, ఇతరులకు సాయపడటం లేని (సోమరి పోతుల) స్వర్గ సుఖం కన్నా, కర్మ భూమియైన భూలోక నివాసమే మిన్న, అని సంభావించిన ముద్గలుని చరిత్ర మానవాళికి క్రియాశీలాన్ని ప్రబోధిస్తోంది.

2) తల్లిదండ్రుల మాట వినడం, వారిని సేవించడంలో గల మహిమను, స్వధర్మాచరణం వలన కలిగే గౌరవాన్ని నిరూపించింది 'ధర్మ వ్యాధోపాఖ్యానం.

3) సత్య నిష్ఠను ప్రతిపాదించేది దుష్యంతోపాఖ్యానం.

4) దుష్టాత్ముని అధికార సంపదలు స్థిరం కావని చెప్పటానికి 'నహుషుని' చరిత్ర నిదర్శనం.

5) తన గొప్ప తాను చెప్పుకొంటే ఆ ఫలితం పోతుందనటానికి 'యయాతి' చరిత్ర ఉదాహరణం.

6) పేదరికం అనుభవిస్తూ కూడా, తనకు ఉన్నంతలోనే అతిథికి ఆప్యాయంగా (ఆహారం) పెట్టటమే గొప్పగా చెప్పింది సక్తు ప్రస్థుని ఔదార్యం.

7) "ఒకరు చేసిన తప్పుకు, ఆ వర్గం మొత్తం ఆపదలపాలు కావలసి వస్తుం" దనేది సర్పయాగ ఘట్టంలోని వివరణ. (ఉదంకోపాఖ్యానం)



"ప్రల్లదు డైన యొక్క కులపాంసను జేసిన దాన తత్కులం
బెల్లను దూషితంబగుట యేమి య పూర్వము ?"

దుర్యోధన శతం, కీచక శతకం వారిలో ఒక్కరి దురాగతం వలననే బలి అయి పోయిందని భారతం వివరించింది.

"చెఱుపకురా చెడేవు" అన్నది ఘోష యాత్రలోని రహస్యం.

8) 'మాతృదాస్య విముక్తి'కై పాటుబడుటం తనయుల కర్తవ్యమని "సౌపర్ణోపాఖ్యానం" ఉపదేశిస్తుంది.

భారత స్వాతంత్ర్య ఉద్యమ సాహిత్యానికి ఎంతో స్ఫూర్తినిచ్చింది యీ ఘట్టం ఇంద్రుడు, వాలఖిల్యాదులను పరిభవించటం "బలహీనులను చూచి బలిగర్వంతో పరిహసించి, దురుసుతనంగా వ్యవహరించే వారికి 'శృంగ భంగం' తప్ప"దని నిరూపించింది.

9) ఆచార హీనత వలన కలిగే అనర్థాన్ని, దైవ వైపరీత్యం వలన ఏర్పడే దుస్థితిని చాటి చెప్పింది 'నలోపాఖ్యానం'.

10) యయాతి చరిత్రలో కచుడు శుక్రాచార్యుల వారి వద్ద "మృత సంజీవనీ విద్య" సంపాదించటం విద్యార్థి దశలో మానవులకు ఎదురయ్యే ఇబ్బందులను, విద్యార్థి పట్టుదలతో వాటిని అధిగమించే విధానాన్ని వివరించింది. ప్రతి ఒక్కరు సౌశీల్య సంపదను కాపాడుకోవాలనే విషయం ప్రకటించింది.

11) భర్తృ సేవా ధర్మాన్ని, పతివ్రతా మహిమను ప్రశంసించింది సావిత్రి - ఉపాఖ్యానము.

12) ఆదర్శ మానవ జీవిత విధానాన్ని అభివర్ణించింది 'రామోపాఖ్యానము"

ధర్మాచరణం ద్వారా మానవుడు మాధవుడు అవుతాడని, మాధవుడే మానవుడై నిరూపించిన వైనం ఇందులో దర్శన మిస్తుంది.

13) "ఎంతటి వారికైనా గర్వము కీడునే కలిగిస్తుందని, గర్వమును విడిచిన వాడే ఉత్తముడ"ని ప్రతిపాదించింది యవక్రీతుని చరిత్రము. (రోమశుడు ఈ కథ ధర్మరాజుకు చెప్పాడు. అ. ప.)

14) ఎవని కీర్తి, ఎంత కాలం ఈ జగత్తుపై వినబడుతుందో అతడంత కాలం పుణ్యలోక సుఖములు పొందుతాడని 'ఇంద్రద్యుమ్న చరిత్ర' వెల్లడించింది. ప్రజలు సత్కర్మములు ఆచరించి చిరకీర్తి సంపాదించుకోవాలని ప్రోత్సహించింది.

15) 'భగీరథుని చరిత్ర' గంగావతరణ ఘట్టాన్ని వివరిస్తూ, పితరులకు ఉత్తమ గతులు కలిగేందుకై సంతతి చేయవలసిన పుణ్య విధుల యెడ ప్రేరణ నిస్తుంది.

లోకంలో ఎవరైనా గట్టి కృషిచేసి గొప్పపని సాధించినప్పుడు వారు 'భగీరథ ప్రయత్నం' చేశారని అనటం పరిపాటి

16) సృంజయుని తనయుడైన 'సువర్ణష్ఠీవి' కథ వలన అత్యాశ క్షేమదాయకం కాదని తెలుస్తుంది. బంగారంపై ఎవరికి అధిక వ్యామోహం తగదని సూచించింది. అది ప్రమాదానికి, ప్రాణహానికి కూడా కారణమని హెచ్చరించింది.

17) త్రిపురాసుర సంహార ఘట్టం శరీరత్రయాన్ని, అధిగమించిన ఆత్మతత్త్వమును ప్రబోధించింది.

18) క్షీర సాగర మథనం, కుండలినీ శక్తిని జాగృత పరచి, యోగానుభవం ద్వారా అమృతత్వాన్ని సాధించడాన్ని సూచిస్తుంది. (దేవాసురులు మనలోని మంచి, చెడులకు ప్రతీకలుగా గ్రహించాలి.)

19) 'సుందోపసుందుల కథ' స్త్రీ వ్యామోహం సోదరత్వాన్ని, స్నేహ సంపదను నశింపజేసి, పరస్పర విద్వేషాన్ని పుట్టించి, వినాశనానికి కారణమవుతుందన్న సత్యాన్ని చాటి చెప్తుంది.

అందువల్లనే పాండవులు నారద మహాముని ఉపదేశాన్ని పాటించి ద్రౌపతి విషయంలో ఒక నియమం ఏర్పరచుకొని, ఆ ప్రకారంగా సుఖ జీవనం సాగించారు. ఒకప్పుడు గో బ్రాహ్మణ రక్షణకై అర్జునుడు ద్రౌపతీ ధర్మజులు ఏకాంతంగా ఉన్న ఆయుధశాలలో ప్రవేశించిన నేరానికి ప్రాయశ్చిత్తంగా తీర్థయాత్రలు చేసాడు. సుభద్రా పరిణయంతో ఆ ప్రయాణం సుఖాంతమయ్యింది. ధర్మాచరణ తత్పరులకు ఎప్పుడు శుభ పరంపరలే కలుగుతాయి. ఇందులో సందేహం లేదు.



# "హనుమద్వాణి"

## డాక్టరు. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి

మహా భారతంలో రామ కథ వర్ణింపబడింది. ఆ రామాయణంలో 'సుందర కాండ'కు ఎంతో ప్రాధాన్యం ఉంది. అందులో కథా నాయకుడు హనుమంతుడు అతని చరితామృతమును 'హనుమద్వాణి' గా ఇచట పొందుపరుస్తున్నాము.

వజ్రము వంటి దృఢమైన శరీరబలము గలవాడు కావున హనుమంతుని "వజ్రాంగ బలి" అన్నారు. ఉత్తర భారతదేశంలో దీనినే "బజరంగ బలి" అని పలుకుతారు.

అతులిత బలధామం, స్వర్ణ శైలాభ దేహం
దనుజ వన కృశానుం, జ్ఞానినా మగ్రగణ్యం
సకల గుణ నిధానం, వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం, వాత జాతం నమామి॥

అంజన, గన్న, నోముఫల, మక్క ఫలీ కరజోద్యతుండు, ముఖ్యం జయ వీర్యడస్త కులోద్ధతి వీరవరాంచితుండు, దీరంజిత భాను సూను, డిత రామ పదుం డవనీ సుతా విపద్భం జను, డక్షసపాంతకుడు, పావని, పావనమూర్తి ప్రోవుతన్.

తమ విద్య వివాదానికి, ధనం గర్వానికి, శక్తి ఇతరులను హింసించటానికి మాత్రమే దుష్టులు పరిమితం చేస్తారు. సత్పురుషులు వానినే వరుసగా జ్ఞానమునకు, దానమునకు, రక్షణకు వినియోగిస్తారు. ఇదీ లోకం పోకడ.

విద్యా వివాదాయ, ధనం మదాయ
శక్తిః పరేషాం, పరిపీడనాయ
ఖలస్య, సాధో ర్విపరీత మేతత్
జ్ఞానాయ, దానాయచ, రక్షణాయ॥

స్వామి కార్యమే కాని, స్వకార్యమే లేని నిస్స్వార్థ పరుడు హనుమంతుడు. సుగ్రీవుని ఆపద నుండి తప్పించి కాపాడిన ధీరుడు హనుమంతుడు. రాముని కార్యము సర్వము సమర్థతతో నిర్వహించిన వీరావతంసుడు.

హనుమంతుని జీవితం సాహసానికి, విజయానికి ఒక ప్రతీక. అతని నడవడి నిర్భయత్వానికి నిదర్శనం. మధుర మధురాక్షరములగు అతని మాటలు సత్య సుందరములు, సాధుజన సమ్మతములు. యుక్తి యుక్తములైన అతని చేష్టలు, వివేక సంభరితములు, పరహితాచరణ సమర్థములు. అతని నామం కార్య సాధకుల హృదయాలకు ఎంతో స్ఫూర్తిదాయకం. ఆత్మ విశ్వాసమే తప్ప అహంకారమెఱుగనిది హనుమంతుని యంతరంగం. వినయానికి, వివేకానికి స్థానమైన వాడు మతిమంతుడైన హనుమంతుడు.

వాల్మీకి రామాయణంలో కథా భాగాన్ని బట్టి ఆయా కాండలకు తగిన పేరు పెట్టినా, హనుమ వైభవాన్ని వర్ణించిన విశేష సందర్భాన్ని 'సుందరకాండ' అని వ్యవహరించాడు. సుందరుడంటే హనుమంతుడని కూడా అర్థం. అంతేకాదు అందులో ప్రతి అంశము సుందరమే. ఆ సౌందర్యము హృదయమునకు ఆనంద సంధాయకము కాగా, అలౌకికమగు ఆ యానందము పరమార్థ ప్రతిపాదకమై పరతత్త్వానుభవమునకు సమర్థమై వెలుగొందుచున్నది.

సుందరకాండ చదివితే వివేకంతో, ధీరత్వంతో పటుదల గలిగి హనుమంతుని వలె తమ లక్ష్యాన్ని సాధించ గలుగుతారు.

అది ఒక మంత్ర రాజంగా భావించి పారాయణ చేస్తే చింతా శోకములు నశించి, అభీష్టసిద్ధి, వ్యవహార జయంతో బాటు సుఖసంపదలు పొందగలుగుతారు.

అదే ఒక యోగ శాస్త్రంగా అవగాహన చేసుకొని అనుభవానికి తెచ్చుకొంటే మోక్షసాధన మార్గం సుగమంగా బోధ పడుతుంది,



సీ॥ రామ నామాంకిత రత్న ముద్రిక నిచ్చి
జనకజ ప్రాణమే ఘనుడు నిలిపె

మైథిలీ వరశిరోమాణిక్య మర్పించి
కడిమి నెవ్వాడు రాఘవునిఁ బ్రోచెఁ

బ్రతికించె నెవ్వాడు పరమ దివ్యౌషధీ
దానంబుచే సుమిత్రా తనూజుఁ

బూని యెవ్వాడు రాముని రాకయెఱిగించి
భరత శత్రుఘ్నులఁ బ్రతుకఁజేసె

సమరమున మూర్ఛనొందిన సకల కపుల
ప్రాణములొసంగి యేమహాబలుడు మనిచె
నట్టి పరమోపకారి, జితాఖిలారి
నద్భుత విహారి, సామీరి నభినుతింతు.

(గోపీనాధ రామాయణం)

హనుమా నంజనాసూనుః వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణ సఖః పింగాక్షో ఽ మిత విక్రమః
ఉదధి క్రమణ శ్చైవ సీతాశోక వినాశకః
లక్ష్మణ ప్రాణదాతాచ దశగ్రీవస్య దర్పహా

ద్వాదశైతాని నామాని కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే పఠే న్నిత్యం యాత్రాకాలే విశేషతః
తస్య మృత్యు భయంనాస్తి, సర్వత్ర విజయీభవేత్.

భక్తితో హనుమంతుని ఈ ద్వాదశనామ స్తోత్రము నిత్యము పఠించు వారికి సకల శుభములు కలుగును.

మనోజవం మారుత తుల్యవేగం, జితేంద్రియం బుద్ధి మతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం, శ్రీరామదూతం శిరసా నమామి

పూర్వము మేరు పర్వత ప్రాంతాన్ని పరిపాలించిన వానర వీరుడు కేసరి. ఆతని మేనమామ కుమార్తె అంజన. పెద్దల అనుమతితో వారిద్దరికి వివాహం ఎంతో వైభవంగా జరిగింది. వారి కుమారుడే ఆంజనేయుడు. అతడు శివాంశ సంభూతుడు. వాయు దేవుని వరమున పుట్టి, గమన వేగంతో బుద్ధి వైభవంతో ప్రసిద్ధి పొందిన ఆ మహాబలుడు, జగమంతా పొగిడేటంతటి అద్భుత కృత్యములెన్నో సాధించి కారణ జన్ముడుగా కీర్తింపబడ్డాడు. వానరకోటిలో సమున్నతుడై చిరంజీవిగా జన్మ సార్థకం చేసుకొన్న మహానుభావుడతడు. గుణ నిధియై రాబోవు కల్పమున బ్రహ్మయై వరలు విశిష్ట వరములు సంపాదించుకొన్న మహాత్ముడు. అనఘుడైన అతడు తన శక్తి యుక్తులన్నీ లోకహితం కొరకు వినియోగించిన ఘనుడు.

ఇతడు చిన్నతనమున తూర్పున నప్పుడే ఉదయించిన సూర్యుని చూచి పండిన పండుగా భావించి, వాయువేగ మనోవేగములతో ఆకాశమున పయనించి, భానుని పట్టుకొని మ్రింగబోయాడు. ఆనాడు సూర్యగ్రహణం. ఆ కారణంగా తనకు అడ్డువచ్చిన రాహువుపై దూకి ఆతనిని వెనుకకు నెట్టి వేశాడు. అప్పుడా రాహువు భయంతో పరుగు పరుగున బోయి, త్రిలోక పరిపాలకుడగు ఇంద్రుని ఆశ్రయించాడు. ఆ ఇంద్రుడు ముందు వెనుక లాలోచింపక తన వజ్రాయుధముచే ఆ బాలుని గట్టిగా కొట్టాడు.

ఆ విధంగా దెబ్బతిని క్రిందపడి, మూర్ఛ పోయిన బిడ్డనుచూచి, వాయువు కోపంతో లోకము నుండి తన రూపాన్ని ఉపసంహరించుకొని, ఆ బాలుని తన ఒడిలో చేర్చుకొని ఒక గుహలో చేరి దుఃఖింపసాగాడు. ప్రాణి లోకమంతా ఉచ్ఛ్వాస, నిశ్వాసములు లేక నిశ్చేష్టితమై పోయింది. జగద్వ్యవహార సర్వము స్తంభించి పోయింది. కొందరు మునులు, ఋషులు, దేవతలతో కలిసి బ్రహ్మ వద్దకు పోయి ఆ దుస్థితి తొలగించమని మొరపెట్టుకొన్నారు.

అప్పుడా బ్రహ్మ ఇంద్రుని తొందరపాటు తనానికి నొచ్చుకొని ఆతనిని మందలించి, వారందరితో కూడి వాయుదేవుడున్న గుహకు చేరి, ఆ బాలుని తన చేతులలో ప్రేమగా నిమిరి పునరుజ్జీవితుని చేసి, వాయువునకు సంతోషం కలిగించాడు. అప్పుడు ప్రసన్నుడైన వాయువు దయవల్ల ప్రాణులన్నీ తృప్తిగా ఊపిరి పీల్చు



కొన్నాయి. బ్రహ్మాస్త్రము మొదలైన ఆయుధములేవీ ఆతనికి బాధ కలిగింపవని బ్రహ్మ అజేయమగు వరము ప్రసాదించాడు. చిరంజీవి కాగలడని ఆశీర్వదించాడు. తక్కిన దేవతలు కూడా ఆ బాలునికి ఎన్నో వరములు అనుగ్రహించారు.

అందులో సూర్యుడు ఇతడు పెరిగి పెద్దవాడై, బుద్ధి తెలిసి, చదువుకొనేందుకు వస్తే, స్వయంగా గురువై తానే అతనికి చదువు చెప్తానని మాట ఇచ్చాడు.

అప్పుడు మొక్క పోయిన దవడగల ఆ బాలుని అందరు హనుమంతు డన్నారు. హను శబ్దమునకు జ్ఞానమని కూడా అర్థము. కావున జ్ఞానము కలవాడు హనుమంతుడు. పెద్దవాడైన తర్వాత హనుమంతుడు పుస్తకం చేత పట్టుకొని సూర్యునకు అభిముఖంగా నిలిచి, వెనక్కు వెనక్కు నడుస్తూ, ఆసక్తితో ఎంతో శ్రద్ధగా ఆతనివద్ద వేద, వేదాంగాది విద్యలన్నీ అభ్యసించి, లోకమంతా మెచ్చు కొనేంతటి బుద్ధిమంతుడయ్యాడు.

సూర్యుడాధీశాలిని తన తనయుడైన సుగ్రీవునికి మంత్రిగా నియమించి ఆతనిని ఎల్లవేళలా అనుసరించి ఉంటూ, ఆపదలు గడవ బెట్టమని ఆదేశించాడు. అదే తనకు ఆ శిష్యుడిచ్చే గురుదక్షిణగా సంభావించాడు.

వాలి, సుగ్రీవునిపై నెపం మోపి, చేయని నేరానికి శిక్షించి, తమ్ముడని కూడా చూడకుండా తన్ని తరిమినప్పుడు, హనుమంతుడు అతనికి ధైర్యం చెప్పి, తక్కిన మిత్రులతో కూడి సుగ్రీవుడు ఋశ్యమూక పర్వతంపై నిర్భయంగా ఉండే ప్రయత్నం చేశాడు. చిన్ననాటి ఇతని చిలిపి చేష్టలు భరించలేక మునులు ఇచ్చిన శాపంవల్ల తన శక్తి తాను మరిచిపోయి దిగంతముల వరకు అతని వెంట తిరిగేదే గాని ఎవరైనా గుర్తు చేసినట్టైతే తన ప్రభువు అన్ని కష్టాలు పడుతుంటే నిస్తేజంగా చూస్తూ ఉండే వాడు కాడు.

తన వాఙ్మాధుర్యంతో రాముని మెప్పులందుకొని సజ్జనులైన రామ, సుగ్రీవు లకు మైత్రి ఘటింప జేశాడు.

చారిత్ర దూషకుడైన వాలి వధానంతరం, కిష్కింధకు రాజైన సుగ్రీవునకు బాసటగా ఉండి, తగిన సమయంలో ఆతనికి కర్తవ్యాన్ని గుర్తు చేశాడు. రామ

కార్యనిర్వహణకై నలు దిక్కుల నుండి వానర కోటిని పిలిపించమని సూచన చేసి మంత్రిగా తన బాధ్యత నెరవేర్చాడు.

సీతాన్వేషణకై బయలుదేరి, శతయోజన విస్తీర్ణమైన దక్షిణ సముద్రాన్ని దాటి లంకజేరి, పలు శ్రమలకోర్చి, అశోక వనంలో ఉన్న సీతను సందర్శించి ఆమె శోకమును మాన్చి, రామ ముద్రికనుఇచ్చి ఆమెకు జీవితాశను కలిగించి, వనము పెకలించి రావణునకు బుద్ధి చెప్పి, లంక దహించి, సీత కుశలవార్త రామునకు తెల్పి, నల నీలాది వానర సమూహముచే సముద్రముపై వారధి నిర్మింపజేసి, రావణ సంహారమున రామునకు చేదోడు, వాదోడుగా నిలిచి, సంజీవనిం దెచ్చి లక్ష్మణుని బ్రతికించి, సమరమున మూర్ఛపోయిన కపి సమూహమునకు ప్రాణము లొసంగి, రాముని రాక విని భరత శత్రుఘ్నుల బ్రతుకజేసి, అయోధ్యలో రామ పట్టాభిషేకోత్సవమునకు దోహదముచేసి, సీతారాములొకచోటచేరి యధివసించిన ఆ పండుగ కనులార చూచి ఆనందించిన యోగి, ఘనుడైన ఆ హనుమంతుడు. ఆతని దీక్ష, దక్షత, రామ ప్రభువు యొక్క ప్రత్యేక మన్ననలకు పాత్రములైన ఆతని గుణ గణములు ప్రపంచమున పూజ్యత సంతరించుకొన్నాయి.

రామావతార సమాప్తి జరిగిన తర్వాత రామనామ భజనానందుడై యుండి ద్వాపర యుగమున భారత కథాకాలమున. సౌగంధిక పుష్పములకై గంధ మాదనమునకు బోయిన భీమునకు దర్శనమిచ్చి ఆతనికి జ్ఞానోదయము గావించి, వరబల సంపదలు ప్రసాదించి విజయము కలుగునటుల దీవించి, పంపించాడు. ఆతని అభ్యర్థన మన్నించి అర్జునుని రథకేతనమునందు దివ్యతేజమున నిలిచి, అధర్మ వర్తనులను రూపుమాయించిన ధీరాగ్రేసరుడు హనుమంతుడు.

ఈ కలియుగమున సహితము ఎందరో మహానుభావులకు దివ్యానుభవము లొసంగి, భక్తితో పిలిచిన పలికే మహిమాన్వితుడుగు ఇలవేలుపై, వరలుచున్నాడు. జాతిని జాగృత పరచు సాహసోపేతమగు ఈ హనుమంతుని జీవితము నుండి అనేక సందేశములు గ్రహింపదగి యున్నవి.

## మాట - మన్నన

వాల్మీకి రామాయణంలో హనుమంతుడు మనకు తొలుతగా దర్శన మిచ్చేది కిష్కింధా కొండలలోనే.



సీతాన్వేషణ నిమిత్తం రామలక్ష్మణులు అరణ్యంలో తిరుగుతూ కబంధుని వధించి, దివ్యత్వమును పొందిన తర్వాత అతడు చెప్పిన ప్రకారము 'ధర్మాత్ముడు' వానర వీరుడు అయిన సుగ్రీవునితో స్నేహం కోరి వారు ఋశ్యమూక పర్వతం దగ్గఱకు వస్తారు.

అల్లంత దూరాన వారిని చూచి సుగ్రీవుడు 'వాలి మనుషులేమో'నని భయపడి పరుగెత్తి పోతుంటే, ఆతనిని ఆపి, ఇతరుల అభిప్రాయాన్ని తెలియ (పరేంగిత జ్ఞానం) గల హనుమంతుడు వారి వలన భయం లేదని నిరూపించి, శుభ తరములైన మాటలతో ధైర్యం చెప్పాడు. ఆతని అనుమతితో రామలక్ష్మణుల విషయం తెలుసుకొనేందుకు కపిరూపాన్ని విడిచి, బ్రహ్మచారి వేషంలో వారి దగ్గఱకు వచ్చి వారినుద్దేశించి "మీరెవ్వరు ? ఎక్కడ నుండి, ఏ ఉద్దేశంతో, ఇక్కడికి వచ్చారు ? మీతేజోరూప బల సంపదలు చూస్తే క్షత్రియ వంశంలో పుట్టిన వారివలె గోచరిస్తున్నారు. వేషం చూడబోతే సంశ్రిత వ్రతులైన తాపసులవలె కనబడుతున్నారు. పట్టుకొన్నవి ధనుర్బాణాలు, కట్టుకొన్నవి నార చీరెలు — ఇది చాలా ఆశ్చర్యంగా ఉంది, ఇంతకూ మీరెవరు ? అని అడిగాడు. అందుకు వారు సమాధానం చెప్పలేదు. వారిని చూచి అయ్యా ! ఇందాకటి నుండి నేను మాట్లాడుతున్నా మీరు ఉలుకు పలుకు లేకుండా ఉన్నారేమిటి ? అంటూ, అపును మరి, "నేనెవరినో చెప్పకుండా మిమ్మల్ని గూర్చి ప్రశ్నించడం సమంజసంగా లేదు." అని ముందుగా తనను తాను పరిచయం చేసుకొంటూ "పవన సుతుడనైన నన్ను హనుమంతుడంటారు. వానరయూధుడైన సుగ్రీవుడు అతని అన్న వాలిచే వెడలగొట్టబడి దుఃఖంతో ఈ పర్వతంమీద ఉంటున్నాడు. ఆతని అంతరంగిక సచివులలో నేనొకణ్ణి. అతడు పంపగా ఇప్పుడు మీవద్దకు వచ్చాను. ఆ సుగ్రీవుడు మీతో సఖ్యాన్ని కోరుతున్నాడు."

ఈ విధంగా చెప్పిన హనుమంతుని మాటలు విని వాక్యజ్ఞుడు, వాక్య కుశలుడు అయిన రాముడు లక్ష్మణుని ఉద్దేశించి "సుగ్రీవుని మంత్రియైన ఈ హనుమంతునకు మధురములు, స్నేహ యుక్తములునైన మాటలతో సమాధానము చెప్పు" మని పలికి అందుకు ముందుగా రాముడే హనుమంతుని మాటలలోని మాధుర్యమును అతడు మాట్లాడే విధానాన్ని చూచి మనసారా మెచ్చుకొన్నాడు. "ఇతడు బాగా చదువుకొన్నవాడని, సంస్కారం ఉట్టిపడేలా మనసు నాకర్షించే రీతిలో మంచి మాటలే చెప్పాడని అభినందించాడు. ఇట్టి యోగ్యుని సహాయం ఉంటే ఎంతటి కష్టంలో

నుండైనా బయట పడవచ్చునని సంభావించాడు. విద్యావంతులెక్కడైనా గౌరవింప బడతారనేందుకు ఇదియొక నిదర్శనం.

సంస్కార క్రమసంపన్నా, మద్రుతా మవిలంబితాం
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హారిణీం॥ (32-3-4)

ఈ సన్నివేశాన్ని పరిశీలించినప్పుడు మనిషికి వన్నెతెచ్చేది, మన్నన కూర్చేది 'మాట' అని, ఆమాట మర్యాదగా మాట్లాడటంలోనే గౌరవం ఉందని అర్థమవుతుంది.

హనుమంతుడు మాట్లాడిన కొద్ది మాటలలోనే విద్యా వివేక సంపన్నమైన తన వ్యక్తిత్వం నిరూపించుకొన్నాడు. రాముడు అంతలోనే హనుమంతుని అంతరంగంలోని గాంభీర్యాన్ని, మాటలలోని మాధుర్యాన్ని గుర్తింప గలిగాడు.

కోకిలమ్మ చేసుకొన్న పుణ్యం బేమి ?
కాకి చేసుకొన్న కర్మమేమి ?
మధుర భాషణమున మర్యాద లభియించు
లలిత సుగుణజాల తెలుగు బాల. (కరుణశ్రీ)

## కర్తవ్యబోధ - విశ్వాస పాత్రత

రామబాణ నిహతుడై వాలి మరణించిన తర్వాత సుగ్రీవుడు కిష్కింధలో పట్టాభిషిక్తుడై సకల సుఖములు అనుభవిస్తూ, రాజ్యనిర్వహణ బాధ్యత మంత్రులపై పెట్టి ప్రమత్తుడై కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

వర్ష ఋతువుదాటి, శరదృతువు ప్రవేశించగానే సచివోత్తముడైన హనుమంతుడు యుక్తియుక్తము, మనోహరము, హితము, పథ్యము అయిన వాక్కులతో ప్రభువునకు సముచితమైన రీతిలో కర్తవ్యమును సూచించి, సుగ్రీవునకు విశ్వసనీయుడేగాక ప్రీతిపాత్రుడు కూడా అయ్యాడు.

రాముని సహాయం వలన నీకు రాజ్యం సిద్ధించింది. సుఖములు లభించాయి ఇంక నీవు మిత్రకార్యము చేయదగి ఉంది. ఎవరు మిత్రకార్యాన్ని చక్కగా నిర్వహిస్తారో వారికి అధికార సంపదలు, కీర్తి ప్రతాపములు చిరకాలం నిలబడతాయి.



న్యాయ మార్గ వర్తనులకిది కర్తవ్యం. అలా చేయనప్పుడు విపరీత పరిస్థితు లేర్పడుతాయి".

"సమయం మించిపోయిన తర్వాత చేసే ఏ మహత్కార్యమైనా మిత్రులకు ఏ విధంగానూ ఉపకరించదు".

"సీతాన్వేషణ నిమిత్తం వానరసేనా సమూహాన్ని పిలిపించి ఆజ్ఞాపించవలసింది".

తస్యత్వం కురువై కార్యం, పూర్వంతేన కృతం తవ ।
హరీశ్వర ! హరిశ్రేష్ఠా నాజ్ఞాపయితు మర్హసి ॥ (19-29-4)

నిర్మోహమాటంగా సకాలంలో సక్రమమైన పద్ధతిని బోధించేవాడు సరియైన సచివుడు

సమయం వచ్చినప్పుడు చెప్పవలసిన విషయం దాచి, ముఖ ప్రీతికై ఇచ్చకములు మాట్లాడేవాడు సరియైన మంత్రి కానేకాడు. తన మంచి కోరి చెప్పిన హితవచనములు పెడచెవిన పెట్టే రాజు రాజుకాడు.

సుగ్రీవుడు హనుమంతుని మాటలు విని, కర్తవ్యాన్ని గుర్తించి కపి సమూహానికి కబురు పంపాడు. అలా చేశాడు కనుకనే ప్రభువు ఆనతి తలదాల్చి మహోగ్ర తేజుడై వచ్చి వాకిట నిలచిన రామానుజుని (లక్ష్మణుని) సమాధాన పరచి తన యోగ్యతను నిరూపించుకొని స్నేహ సూత్రాన్ని కొనసాగించుకోగలిగాడు.

తొలుతనే హనుమంతునిలో ఈ విధమైన శక్తి సామర్థ్యములు గుర్తించిన రాముడు ఇట్టివాడు తోడుగా ఉంటే ఎట్టి పరిస్థితులలోను కార్యసాధన జరిగి తీరుతుందని ప్రకటించాడు.

లోకంలో కొందరు "ఎవరితో ఏమంటే ఏమి ఇబ్బంది వస్తుందో మనకెందుకులే" అని చెప్పవలసింది చెప్పకుండా కూడా ఊరుకొంటారు. అటువంటి వారు విశ్వసనీయులు కారు. ఏమి చెప్పాలన్నా వారికి వారి స్వార్థం అడ్డు వస్తుంది. స్వామి కార్య ధురంధరుడైన హనుమంతుని విషయంలో ఆ ప్రసక్తికి తావేలేదు. అలా ప్రబోధించిన హనుమంతుడు ప్రభువుకు విశ్వాస పాత్రుడయ్యాడు.

## అర్హత ఉంటే - అవకాశం లభిస్తుంది

మనోజవం మారుత తుల్య వేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం, వానరయూధ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి.

సుగ్రీవుడు, సీత నన్వేషింప వానర వీరులందరిని నలుదిక్కులకు పంపుతూ ఆ యా దిక్కులలో ఉండే విశేషాలు విపులంగా వివరించాడు. ఇవి రామాయణ కథా కాలం నాటి ప్రపంచ భౌగోళిక పరిస్థితిని సూచిస్తున్నాయి.

అందులో యువరాజు అయిన అంగదుడు నాయకుడు కాగా జాంబవంతుడు, హనుమంతుడు మొదలైన వానరవీరులు తోడుగా నడువగా దక్షిణ దిక్కుకు కొందరు వెళ్ళారు. వారిలో కార్యసాధకుడు హనుమంతుడేయని ఆతనికి గల కార్య విషయాసక్తిని బట్టి వెల్లడి అయ్యింది. ఆ సంగతి గమనించిన రాముడు తన పేరుతో ఉన్న ఉంగరాన్ని హనుమంతునికిచ్చి సీతకది ఆనవాలుగా ఇవ్వటానికి ఉంటుందని దానిని చూచి ఆమె ఆతనిని గుర్తింపగలుగుతుందని భావిస్తున్నట్లు వివరించాడు.

దదౌ తస్యతతః ప్రీతః స్వనామాం కోపశోభితం ।
అంగులీయ మభిజ్ఞానం రాజపుత్ర్యాః పరంతపః ॥
అనేన త్వాం హరిశ్రేష్ఠ । చిహ్నేన జనకాత్మజా ।
మత్సకాశాదను ప్రాప్త మనుద్విగ్నోఽను పశ్యతి ॥ (12.13-44-4)

"ఓ వీరుడా ! బలము, పరాక్రమముతోపాటు ప్రయత్న శీలము గల నీకు ఈ సుగ్రీవుని సందేశము తోడు కాగా, నీ యెడ కార్య సిద్ధిని తెలియజేస్తున్నదని రాముడు హనుమంతుని అభినందించాడు.

వ్యవసాయశ్చతే వీర । సత్త్వయుక్తశ్చ విక్రమః ।
సుగ్రీవస్యచ సందేశ స్సిద్ధిం కథయ తీవమే ॥

ఇంతమంది వానర యోధులు ఉండగా హనుమంతునికే అంగుళీయకం ఇవ్వబడటం ఆతని శక్తి, సామర్థ్యాలకు గుర్తింపుగా చెప్పుకోవచ్చు. అతడా నమ్మకాన్ని వమ్ము కానివ్వలేదు.



నేడు సమాజంలో ఎన్నో కోట్ల మంది ప్రజలు ఉంటూ ఉండగా, కొందరే ఆసక్తితో రామ కార్యానికి పూనుకోవటం, వారి అదృష్టంగా అనిపిస్తుంది. 'తానాశించిన మంచి కోరుకొనే సమాజం ఈ విషయంలో సమర్థులైన వారి యెడ కొంత ఆశ పెట్టుకొని ఉంటుంది. ఆ లక్ష్యం సాధించటానికి, ఆ మహత్కార్యం నెరవేర్చటానికి వారికి హనుమంతుడే ఆదర్శంగా నిలుస్తాడు.

గీతలో భగవంతుడు "వేయి మందిలో ఒక్కడు నా గురించి ప్రయత్నిస్తాడు. అలా ప్రయత్నించిన సాధకులలో ఏ ఒక్కడో యథార్థంగా నన్ను తెలుసుకోగలుగుతాడు." అని వివరించాడు.

హనుమంతుడలా ప్రయత్నం చేసి, సిద్ధి పొందిన వారిలో అగ్రగణ్యుడు.
మనుష్యాణాం సహస్రేషు, కశ్చిద్యతతి సిద్ధయే
యతతా మపిసిద్ధానాం, కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

### ఆ త్మ వి శ్వా స ము

గోష్పదీ కృత వారాశిం, మశకీకృత రాక్షసాం
రామాయణ మహామాలా, రత్నం వందేఽనిలాత్మజమ్ ॥

సీత లంకలో ఉన్నదన్న సంగతి జటాయువు అన్న సంపాతి చెప్పాడు. అయితే, దక్షిణ సముద్రం ఒడ్డున చేరిన వానర సమూహంలో శతయోజన విస్తీర్ణమైన ఆలవణ సముద్రాన్ని దాటి లంకలో ప్రవేశించగల వీరుడెవ్వడూ లేకపోవటంతో జాంబవంతుడు లోకహితం కోరి వాయుసుతుడైన హనుమంతుని ఆ మహత్కార్యానికి ప్రేరేపించాడు. చిన్నతనంలోనే సూర్యుని మ్రింగబోయిన ఆతని సాహసాన్ని, దేవతలు ప్రసాదించిన వరబల వైభవాన్ని గుర్తు చేశాడు. మునుల శాపంతో విస్మృతమైన ఆతని మహిమ అప్పుడు స్ఫురణకు రావటంచేత హనుమంతుడా రామకార్యం నిర్వహించటానికి పూనుకొన్నాడు.

మహేంద్ర పర్వతంపైన చేరిన హనుమంతుడు తన సహచరులతో "నేను అప్రతిహతమై అమిత వేగం గల రామబాణం వలె శ్రీఘ్రముగా లంకకు చేరి, జానకి జాడ తెలిసికొని వెంటనే తిరిగి వస్తానని, ఆమె అక్కడ కనబడకపోతే రావణునితో సహా లంకనే పెకలించుకొని వస్తాన"ని ప్రతిజ్ఞ చేస్తాడు. ఇందులో అతని అహంకారము కాక ఆత్మవిశ్వాసమే ప్రస్ఫుటమవుతుంది. అట్టి ఉత్సాహమే ఆతని కార్యసాధనకు మూలమని తెలుస్తోంది.

## కార్య దీక్ష

తతో రావణ సీతాయాః సీతాయా శ్శత్రుకర్మణః
ఇయేష పదమన్వేష్టుం చారణాచరితే పథి ॥ (1-1-5)

సముద్రాన్ని దాటటానికి హనుమంతుడు ఆకాశ మార్గంలో వెళ్తూ ఉంటే సిద్ధ చారణ, గంధర్వ, విద్యాధరులాదిగా గల దేవతా గణములు అతని సాహసాన్ని ప్రశంసించాయి.

రామార్థం వానరార్థంచ, చికీర్షన్కర్మదుష్కరం ।
సముద్రస్య పరంపారం దుష్ప్రాపం ప్రాప్తుమిచ్ఛతి ॥ (30-1-5)

కొంత దూరం వెళ్ళేటప్పటికి సముద్రుని ప్రేరణతో మైనాకుడు దర్శనమిచ్చాడు. పర్వతాకారంలో ఉన్న అతనిని చూచి ఇదేదో రాక్షస మాయ యని భావించి హనుమంతుడు బలంగా ఢీకొన్నాడు. ఆ దెబ్బకు దిమ్మెరపోయిన మైనాకుడు తన శిఖరాగ్రంపై మానవాకారంలో దర్శనమిచ్చి "నూరు యోజనముల నిడివి గల ఈ సముద్రం ఒకేసారి దాటటం ఎంతో కష్టం. అందువల్ల కొంతసేపు ఈ పర్వత శిఖరంపై విశ్రమించి ఇచటి అమృతంతో సమానమైన జలములు గ్రోలి, మధురములైన ఫలములు భుజించి, సేదదీర్చుకొని తర్వాత వెళ్ళవలసిందిగా కోరాడు.

మైనాకుని అతిథి పూజా తత్పరతకు, ధర్మపరాయణతకు మెచ్చుకొని, తాను అవి అన్నీ స్వీకరించినట్లే భావించమని చెప్పి, అతనిని ఆదరణతో స్పృశించి, ఎటువంటి సుఖాలు అభిలషించకుండా, ఏ ప్రలోభాలకు తాను లోబడకుండా, ప్రభుకార్య నిర్వహణాసక్తుడై, ప్రతిజ్ఞా భంగ మేర్పడకుండ ముందుకు సాగిపోయాడు.

త్వరతే కార్యకాలోమే, అహశ్చాప్యతి వర్తతే ।
ప్రతిజ్ఞాచ మయాదత్తా, న స్థాతవ్య మిహాంతరే ॥ (132-1-5)

అది చూచి అతని అలోలుపతను మెచ్చుకొన్న దేవతలు, ఋషులు ఇది అతడు సాధించిన రెండవ అద్భుతంగా అభివర్ణించారు.

తద్ద్వితీయం హనుమతో దృష్ట్వా కర్మ సుదుష్కరం ।
ప్రశశంసు స్సురాస్సర్వే సిద్ధాశ్చ పరమర్షయః ॥ (137-1-5)



## అగ్ని పరీక్ష

వేగంగా ముందుకు వెళ్తున్న హనుమంతుని వివేకాన్ని పరీక్షించటానికి దేవమాత 'సురస' ప్రయత్నించింది. భీకరాకారంతో నోరు తెరచి నిన్ను మ్రింగుతానని ఎదుట నిలిచిన ఆమె నోరు మరింత పెద్దది చేసేలా ముందు తన శరీరాన్ని పెంచి, అంతలో తగ్గించి ఆమె నోట్లో ప్రవేశించి, తిరిగి వచ్చేశాడు. ఆమె మాట నెగ్గింది. లంకలో గల రాక్షస మాయలను జయించగలడనే విశ్వాసం దేవతలకు కలిగింది. సురస అతని యుక్తికి మెచ్చుకొని అర్థసిద్ధి కలుగుగాక యని ఆశీర్వదించింది. సీతారాముల సమాగమానికి ప్రయత్నించమని ప్రోత్సహించింది.

అర్థసిద్ధ్యై హరిశ్రేష్ఠ ! గచ్ఛసౌమ్య యథా సుఖమ్ ।
సమానయస్వ వైదేహీం రాఘవేణ మహాత్మనా ॥ (162-1-5)

ఇది హనుమంతుడు సాధించిన మూడవ అద్భుత కర్మగా వర్ణించి ఆకాశ భూతములు మేలుమేలని అతనిని అభినందించాయి.

## కార్య సాధనములు

ఇంకా కొంతదూరం వెళ్ళేటప్పటికి 'సింహిక' అనే ఛాయాగ్రహ మొకటి హనుమంతుని ప్రయాణానికి అవరోధం కలిగించింది. అది గమనించి మతిమంతుడైన హనుమంతుడు ఆమెను తన శక్తితో హతమార్చాడు. తర్వాత ఒక్క క్షణంలో సముద్రము ఆవలి ఒడ్డున గల మలయాచలంపై కాలు మోపి లంకను దగ్గర నుండి వివరంగా కనుగొన్నాడు.

అప్పుడచ్చటి ఆకాశ సంచారములైన భూతములు ఆతడొనరించిన ఘనకార్యములను మెచ్చుకొని అభీష్టసిద్ధికై వెడలుమని ఈ విధంగా ప్రశంసించాయి. "ఎవరైతే నీలో ఉన్న ధైర్యము, దూరదృష్టి, శాస్త్ర విజ్ఞానముతో కూడిన బుద్ధి బలము, కార్య నిర్వహణ సామర్థ్యము అలవరచుకొంటారో వారెన్నడు అపజయము పాలుకారు."

యస్యత్వేతాని చత్వారి వానరేంద్ర యథాతవ ।
ధృతి, ర్దృష్టి, ర్మతి, ర్దాక్ష్యం, స్వకర్మసున సీదతి ॥ (189-1-5)

ఏదైనా ఒక గొప్ప పని సంకల్పించి, చేయటం మొదలు పెట్టినప్పుడు అభిందించేవారు కొందరు, గౌరవంతో ఆదరించేవారు ఇంకొందరు, ఏ విధంగా

చేయగలుగుతాడో చూద్దామని పరీక్షించేవారు మరి కొందరు. అవరోధాలు కలిగించేవారు ఇంకెందరో ఉంటూ ఉంటారు. ఇవియేవీ లక్ష్యపెట్టకుండా సుఖదుఃఖాలకు అతీతంగా దీక్షతో సంకల్పం నెరవేరేందుకు, గమ్యం చేరేంత వరకు మధ్యలో ఆగక వెనుదిరిగి పోవక ముందుకు పయనించగలగడం కార్యసాధకుని లక్షణం.

## యుక్తితో, శక్తితో శత్రువును జయించాలి.

సూర్యుడ స్తమించగానే లోకమంతట చీకట్లు వ్యాపించాయి. హనుమంతుడు సూక్ష్మ రూపంతో లంకలో ప్రవేశింపబోయాడు. తనకు అడ్డుపడిన లంకిణిని శక్తితో జయించి ఆతడు పట్టణంలో ప్రవేశించి, సీతకై కోటలు, పేటలు, బాటలు, తోటలు ఇళ్ళు, వాకిళ్ళు అన్నీ తిరిగి తిరిగి, నాలుగంగుళాల భూమి కూడా విడిచిపెట్టకుండా మొత్తం వెతికాడు. సీత జాడ తెలియలేదు.

## వివేకంతో భ్రమలు తొలగించుకోవాలి

రావణాంతఃపురంలో ప్రవేశించి, ఆతని పడక గదిలో హంసతూలికా తల్పం పైన నిద్రపోతున్న సర్వలక్షణ సంపన్నమైన మండోదరిని చూచి ఆమె పాతివ్రత్య తేజానికి ఆశ్చర్యపడి, ఆమె 'సీత'గా భావించి, వచ్చిన పని సాధించానని సంతోష పడ్డాడు. ఆ ఆనందంతో గంతులు వేశాడు. చిందులు త్రొక్కాడు. అయితే అంతలోనే వివేకంతో ఆలోచింపసాగాడు. భ్రమ తొలగిపోయింది. నిత్యము అంతగా రామునిచే అభిమానింపబడుతున్న సౌశీల్యవతియైన సీత పరాయి ఇంట్లో, పరపురుషుని సరసన పడుకొని ఇలా మైమరచి నిద్రపోతుందా? ఇది జరిగే పనేనా? కాదు. "అని నిర్ణయించుకొన్నాడు. తర్వాత అక్కడ నుండి బయటపడి సీత మరెక్కడైనా ఉండి ఉంటుందని పరిశీలించటం ప్రారంభించాడు.

ఎంత తెలివిగల వారైనా ఒకప్పుడు పొరపడటం జరుగుతుంది. అయితే వారు మంచి చెడులను నిర్ణయించగల వివేకం ద్వారా వెంటనే తమకు కలిగిన భ్రమ, ప్రమాద స్థితులను గ్రహించుకొని, ఆలోచనను, ఆచరణను సరిదిద్దుకొంటారు. మూర్ఖులు భ్రమలోనేపడి కొట్టుమిట్టాడుతూ, లక్ష్యానికి దూరంగా జరిగిపోతారు.

## మానసిక వికారం లేనివాడే ధీరుడు

రావణాంతఃపురంలో పట్టపునిషియైన మండోదరియేకాక మరెందరో స్త్రీలు ఉన్నారు. వారంతా ఆ రాత్రివేళలో స్వేచ్ఛగా అర్ధనగ్నంగాను, నగ్నంగాను, పడి



ఉండటం హనుమంతుడు గమనించాడు. "ఆ భవన మొక స్త్రీ వనంలా ఉన్నదని" అని పించిందతనికి. స్త్రీని స్త్రీలలోనే వెతకటం ఔచిత్యమే అయినా, వారిని ఆ స్థితిలో చూడటం పాపహేతువవమో అని శంకించి ఆత్మ విమర్శ చేసుకొన్నాడు.

కామం దృష్ట్వామయా సర్వావిశ్వస్తారావణ స్త్రియః ।
నహిమే మనసఃకించి ద్వైకృత్యము పపద్యతే ॥ (40.11.5)

అయితే లక్ష్య సిద్ధికై యత్నిస్తున్న హనుమంతుడికి వారిని చూచినంత మాత్రంచేత ఏ వికారము కలుగలేదు. అందువల్ల, తన కెటువంటి పాపము కలుగ బోదని సమాధానః డ్డాడు. జితేంద్రియుడైన హనుమంతుని ప్రవర్తనకు ఆతని విశుద్ధ మగు అంతరంగమే నిజమైన సాక్షి.

## పాప, పుణ్యాలకు మనస్సే కారణం

వికారహేతువు లున్నప్పటికి ఎవరి మనస్సు నిశ్చలమై వికృతులకు లోనుకాదో అతడే ధీరుడు - (కాళిదాసు) ఇంద్రియాలు పనిచేయాలంటే ముందు మనస్సులో సంకల్పం కలగాలి. మంచి, చెడులు రెండింటిలోను ఆ మనస్సు చలించనంత వరకు ఏ పాపములుండవు. అందువల్ల మనస్సును వశపరచుకోవాలి. అప్పుడే వ్యక్తిత్వం నిలబడుతుంది. ఆ సుస్థిరత హనుమంతుడు సాధించాడు.

మనోహిహేతుస్సర్వేషా మింద్రియాణా ప్రవర్తనే
శుభాశుభ వ్యవస్థాసు, తచ్చమే సువ్యవస్థితమ్ ॥ (వా.రా. 41.11.5)

మానవుడు సంఘజీవి. సమాజాన్ని విడచి ఒంటరిగా జీవించలేడు. (అది ఋషులకే సాధ్యం.)

ఈనాడు సమాజంలో కామ క్రోధాదులను రెచ్చగొట్టి అనేక రకాలుగా బలహీనతలను సొమ్ము చేసుకొనే పరిస్థితులు బోలెడు ఏర్పడ్డాయి. ఇన్ని ఆకర్షణల మధ్య ఈ సమాజంలో ఏ ప్రలోభాలకు లోబడకుండా ఉంటూ తమ వ్యక్తిత్వాన్ని కాపాడు కోవాలంటే, మానవుడు మానవుడుగా బ్రతకాలంటే, అభ్యాస పూర్వకంగా తాను మనో నిగ్రహాన్ని సాధించాలి. అను శాసనబద్ధమైన జీవనాన్ని సాగించటం ద్వారానే ఆ క్రమశిక్షణ అలవడుతుంది. అట్టి ఉత్తమ సంస్కారం కలగడానికి ఉన్నతమైన ఒక ఆదర్శం కావాలి. అద్దం చూచి మొహం దిద్దుకొన్నట్లే ఆదర్శం చూచి బ్రతుకు దిద్దు

కోవటం సాధ్యమవుతుంది. మనస్వియైన హనుమంతుని సచ్చరిత్ర ఆ ప్రయోజనాన్ని మనకు అందిస్తుంది. "యోగస్థః కురుకర్మాణి" అన్న గీతాచార్యుని వచనానికి హనుమంతుడే చక్కని ఉదాహరణ.

లోకంలో నిత్యం జరిగే ప్రమాదాలకు మనస్సు అదుపులో లేకపోవటమే ముఖ్య కారణంగా గమనిస్తున్నాం. ఏ కాలంలోనైనా ఎవ్వరే పనిలో రాణించినా వారి ఏకాగ్రబుద్ధియే అందుకు మూలం. దీనినే పెద్దలు "యోగః కర్మసు కౌశలమ్" అని నిర్వచించారు.

హనుమంతుడు అంతఃపురం నుండి బయటపడి సీతకై వెతకుచు అశ్వశాలలు, గజశాలలు, పానశాలలు, ఉద్యానవనములు, లతా గృహములు, సరోవరములు అన్నీ తిరిగాడు, సీత జాడ తెలియలేదు. ఉత్తమ సంస్కారవంతురాలు, శీలవతియైన సీత దుష్టాత్ములైన ఈ రాక్షసుల చేతిలో హతురాలై ఉంటుందేమో. ఆమె జీవించి ఉంటే కనపడదా ? అని యాలోచించి హనుమంతుడు నిరుత్సాహ పడ్డాడు.

వచ్చిన పని కాలేదు ఏం చేయాలో తోచలేదు. సముద్రం ఆవలి ఒడ్డున తన రాకకై వేయికళ్ళతో ఎదురు చూస్తున్న వానర వీరులకు ఏమని చెప్పగలడు ? కేవలం ఈ నీరసమైన వార్త చెప్పటానికి తాను తిరిగి వెళ్ళటమా ? మానటమా ? అనే సందేహంలో పడ్డాడు.

## ఆత్మహత్య మహా దోషం

ఈ దారుణ వార్త విన్నప్పుడు సలక్ష్మణుడైన రాముడు ప్రాణాలతో జీవిస్తాడా ? ఆ మిత్రుని కష్టం చూచి సుగ్రీవుడు, అతని పరివారం, భరించగలరా ? ఈ విషయం అయోధ్యలో తెలిస్తే అచటి వారందరు ఏమౌతారో ? ఇంత మందికి బాధాకరమైన ఈ దుర్వార్త మోసుకుపోవటం కంటె ఏదో విధంగా ఇక్కడే ప్రాణ త్యాగం చేస్తేనే బాగుంటుందేమో ? వెతకటానికి వెళ్ళిన హనుమంతుడు తిరిగి వస్తాడనే ఆశతోనైనా వారు మరికొంత కాలం జీవిస్తారు" అని కొంతసేపు చింతాక్రాంతమైన చిత్తంతో ఆలోచించాడు.

కర్తవ్యాన్ని బాధ్యతగా భావించే వారి కెవరికైనా సామాన్యంగా ఆలోచనే ఇది - అయితే ప్రాణ పరిత్యాగమే సమస్యకు పరిష్కారం కాదు కదా ! వివేకవంతులకిది చేయదగిన (పని) పద్ధతికాదు.



ఒకవేళ పిరికితనంతో ఎవరైనా అలా చేసినప్పుడు జరిగే అనర్థం ఇంతా అంతా అని చెప్పటానికి వీలుపడదు. కేవలం తన మీద ఆధారపడి బ్రతుకుతున్న కుటుంబ సభ్యులనే కాక, తన సామర్థ్యం మీద నమ్మకం పెంచుకొన్న వారిని (సమాజాన్ని) సహితం నట్టేటముంచి వ్యర్థ పుచ్చటమే జరుగుతుంది గాని క్రొత్తగా సాధింపబడేది ఏమీ ఉండదు.

తన ఆశ నెరవేరాలంటే, తన ఆశయం సిద్ధించాలంటే, తన సిద్ధాంతం ప్రచారం కావాలంటే బ్రతికి తీరాలి. జీవితంలో ఎదురైన క్లిష్ట సమస్యలను ధైర్యంతో ఎదుర్కోవాలి. లక్ష్య సిద్ధికై పోరాడాలి.

అవరోధాలు, అవాంతరాలు కలిగినప్పుడు నీరుకారి పోకూడదు. నిబ్బరంగా నిలబడి, ప్రతికూల పరిస్థితులను ప్రతిఘటిస్తూ, విజయం లభించే వరకు ప్రయత్నించాలి.

హనుమంతుడు ఈ విధంగా ఆలోచించి "ఏ పనియైనా సాధించటానికి ఉత్సాహమే కారణం, అది సిరి సంపదలతో బాటు సుఖాన్ని, శాంతిని కూడా సంపాదించి పెడుతుందని, అందుకు తగిన ప్రయత్నం చేయా"లని భావించి, తిరిగి తన అన్వేషణా కార్యక్రమాన్ని ముమ్మరం చేశాడు.

అనిర్వేదశ్శ్రియో మూల, మనిర్వేదః పరంసుఖమ్।
అనిర్వేదోహి సతతం, సర్వార్థేషు ప్రవర్తకః॥ (10-12-5)

అయినా ఈసారి కూడ అతనికి ఫలితం శూన్యమే అయ్యింది. సీత కనబడలేదనో మరణించిందనో చెప్పడం ఇష్టం లేదు. చెప్పకపోతే దోషం. ఈ అప్రియం చెప్పినా దోషమే. "ఇట్టి పరిస్థితులలో నా మనస్సు కర్తవ్యాన్ని గురించి ఆలోచింపలేక పోతోంద"ని విచారించాడు.

కథన్ను ఖలు కర్తవ్యం విషమం ప్రతిభాతిమే. (18-13-5)

ఈ విధంగా కొద్దిసేపు చింతా నిమగ్న మానసుడైన హనుమంతుడు, తనకిక మరణమే శరణ్యమేమో అని తలపోసి వివేకం గలవాడు కనుక అంతలో తెలివి తెచ్చుకొని ఆత్మహత్య మహాపాతకమని అది ఎన్నో అనర్థములకు కారణమవు

తుందని బ్రతికి యుండుటే భావ్యమని యోచించి, ఈసారి గట్టి పట్టుదలతో "ఈ లంకా పట్టణంలో యశస్వినియైన రామపత్నిని, సీతను దర్శించే వరకు నా ప్రయత్నం విరమించ"నని నిర్ణయించుకొన్నాడు.

వినాశే బహవో దోషా, జీవన్భద్రాణి పశ్యతి।
తస్మాత్ప్రాణాన్ ధరిష్యామి, ధ్రువో జీవతి సంగమః॥ (47-13-5)

యావత్సీ తాంహి పశ్యామి, రామ పత్నీం యశస్వినీం।
తావదేతాం పురీం లంకాం, విచినోమి పునః పునః॥ (52-13-5)

## ప్రయత్న శీలమే విజయమునకు సోపానము

ఒకొక్కప్పుడు ప్రయత్నశీలురైన వారు ఓటమిని పొందటం నేరమేమీ కాదు. అది విజయానికి సోపానంగానే భావించి, ఉద్యమించినట్లయితే ఎన్నో ఘన విజయాల్ని కడు సమర్థవంతంగా సాధించగల్గడంలో ఆశ్చర్యమేమీ లేదు.

ఇలాంటి మంచి విషయాలెన్నో వివరించి బుద్ధిని, బలాన్ని, ధైర్యాన్ని, సత్ప్రవృత్తిని పెంపొందించేది కనుకనే పెద్దలు 'సుందర కాండను' పారాయణ చేయ వలసిందని ఆదేశించారు. నమోస్తు రామాయ.

ఈ విధంగా ఆలోచించి హనుమంతుడు తన చుట్టూ కలయ చూచే సరికి దూరంగా ఒక కోట గోడ, ఆ ప్రక్కనే ఒక ఉద్యానవనం గోచరించాయి. ఆ ప్రదేశంలో తానింత వరకు ప్రయత్నం చేయలేదు. అందుకే ఇప్పుడక్కడకు పోవ సంకల్పించాడు.

## దైవము అనుకూలించినప్పుడే పౌరుషము ఫలిస్తుంది.
## పౌరుషానికి దైవం తోడ్పడినప్పుడే కార్యసాధన జరుగుతుంది.

ఇంతవరకు హనుమంతుడు తన శక్తి, యుక్తులను వినియోగించి లంక అంతా అన్వేషించాడే కాని తన స్వామి రాముని నిశ్చల చిత్తంతో స్మరింపనే లేదు. తక్కిన దేవతలను ప్రార్థింపనే లేదు. అందుకే వారందరిని భక్తితో, ప్రపత్తితో



కనులు మూసుకొని గట్టిగా ధ్యానించాడు. దైవం అనుకూలించాలంటే ఏకాగ్రబుద్ధితో ధ్యానించట మొక్కటే సరియైన మార్గమని హనుమచ్చరిత్ర మనకు తెలియజేస్తోంది.

నమోఽస్తురామాయ సలక్ష్మణాయ
దేవ్యైచ తస్యై జనకాత్మజాయై
నమోఽస్తు రుద్రేంద్రయమా నిలేభ్యో
నమోఽస్తు చంద్రార్క మరుద్గణేభ్యః (59-13-5)

ఈ శ్లోకమే రాముని గూర్చిన మంత్రంగా భావించి నిత్యం పారాయణ చేసే సంప్రదాయం లోకంలో ఉంది.

అక్కడ నుండి హనుమంతుడు అశోకవనంలో ప్రవేశించి కింశుపా వృక్షం క్రింది రాక్షసీ జన మధనంలో రామనామ స్మరణంతో తదేకధ్యానంతో ఉన్న సీతను సందర్శించాడు. ఆమెను చూడ గలిగినందుకు ఆనంద బాష్పములు విడుస్తూ, సంతుష్ట హృదయంతో లక్ష్మణ సహితుడైన రామునకు నమస్కరించాడు.

## అనురూప దాంపత్యము

హనుమంతుడు సీతారాములు అనురూప దంపతులను విషయం నిరూపిస్తూ "రాముని మనస్సు ఈమె యందు, ఈ సీత మనస్సు ఆ రాముని యందు లగ్నమై యున్నవని తెలిసికొని అందువల్లనే మధుర ప్రణయ భరితాంతరంగులకు వీరువురు ఇంతటి వియోగవేదన అనుభవిస్తున్నారని నిర్ణయించుకొన్నాడు.

అస్యా దేవ్యా యథారూప మంగ ప్రత్యంగ సౌష్ఠవం,
రామస్యచ యథారూపం, తస్యేయమసితే క్షణా॥
అస్యాదేవ్యా మనస్తస్మిం స్తస్యచాస్యాం ప్రతిష్ఠితం
తేనేయం సచధర్మాత్మా ముహూర్తమపి జీవతి॥ (51,52-15-5)

"సీత అంతటి మహాసాధ్వికే ఇంతటి కష్టం సంప్రాప్తించిందంటే ఎటువంటి వారికి కాలమెంతటి దురతిక్రమమైనదో" అని తలచుకొని విచారించాడు. సమానమైన శీలము, వయస్సు, చరితము, అభిజాత్యము, లక్షణములు గల వీరిరు

పరి దాంపత్యమెంతటి యన్యరూపమైనదో యని భావించి ఆనందంతో యభివర్ణించాడు. వివాహానికి వధూ, వరులుగా నిర్ణయించే ముందు స్త్రీ పురుషుల యందు మనం గమనింపవలసిన విషయము లిందులో చక్కగా వివరింపబడ్డాయి. అటువంటి వారి దాంపత్యం ఈడు, జోడుగా ఉండి, సుఖ శాంతులకు అలవాలమై ఉంటుందని పెద్దల అభిప్రాయము.

తుల్యశీల వయోవృత్తాం, తుల్యాభిజన లక్షణాం
రాఘవోఽర్హతి వైదేహీం, తం చేయమసితే క్షణా॥ (5-16-5)

త్రైలోక సామ్రాజ్యము, సీత ఈ రెండింటిలో ఏది ఉత్కృష్టమనే విషయము ప్రస్తావనకు వచ్చినప్పుడు రాజ్య సంపద లేశ మాత్రమే యవుతుందని సంభావించాడు

రాజ్యం వాత్రిషు లోకేషు, సీతావా, జనకాత్మజా।
త్రైలోక్య రాజ్యం సకలం సీతాయా నాప్నుయాత్కలాం॥ (14-16-5)

అందుకే రాముడు ఈ సీతా వియోగంతో బాధపడుతూ రాత్రులు కూడా నిద్రపోవటం లేదు. ఒక వేళ ఏ తెల్లవారుజామునో సుప్తుడైనను అంతలో 'సీతా' అని కలవరిస్తూ మేల్కొంటున్నాడు. ఈ మహిళా శిరోమణి కొరకే కబంధ వధ. వాలి సంహారము మొదలైన దుష్కరములగు కార్యములెన్నో సాధించాడని 'హనుమంతుడు ప్రశంసించాడు.

అనిద్ర స్సతతం రామః సుప్తోపిచ పరంతపః।
సీతేతి మధురాం వాణీం వ్యాహరన్ ప్రతిబుధ్యతే॥

రాముని సంగతి అలా ఉంటే ఆ రామాగమన కాంక్షియై ఎదురు తెన్నులు చూస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్న సీతా సాధ్వి అశోక వనంలోని ఈ ప్రకృతి సౌందర్యాన్ని గాని, రాక్షసుల భోగ భాగ్యాలను గాని కన్నెత్తియైనా చూడటం లేదని అంతర్ముఖమై హృదయస్థుడైన రాముని మాత్రమే దర్శించుచున్నదని గుర్తించాడు. అట్టి అనన్య ప్రేమయే సీతారాముల సమాగమమునకు మూలమనుట ఇచట సూచితమైనది. జీవాత్మ పరమాత్మల ఐక్యమున కిది ప్రతీకగా చెప్పబడినది.



నైషాపశ్యతి రాక్షస్యో, నేమాన్పుష్ప ఫలద్రుమాన్
ఏకస్థ హృదయా నూనం, రామమే వానుపశ్యతి॥ (25-16-5)

ఈ విధంగా ఉన్న సీతను హనుమంతుడు సందర్శించేటప్పటికి తెల్లవారు జామయ్యింది. ఇంకా రాత్రి కొద్దిగా మాత్రమే మిగిలి ఉంది.

అంతలో రావణుడు సపరివారంగా అశోక వనానికి వచ్చి, సీతను అతఃపురానికి చేరి, సకల సుఖాలు అనుభవించమని అనేక విధాల ప్రార్థించాడు. అనేక రత్నరాశులతో కూడిన లంకా రాజ్యం సర్వం ఆమె వశం చేస్తానని ప్రలోభ పెట్టాడు. "త్రిలోకాలలో తనయంతటి వీరుడు లేడని, సర్వస్వం కోలుపోయి, అడవులలో ఆకు, అలములు తిని కాలం వెళ్ళబుచ్చుతున్న రాముడు ఈ లంకకు వచ్చి నిన్ను కాపాడజాలడని (విభేదం సృష్టించి) భయపెట్టాడు. చివరకు తాను చెప్పిన మాట వినక, మనసు మార్చుకొనక మారాం చేస్తే ఇక నీవు బ్రతకటం కష్టమని బెదిరించి' ఇలాగే మూర్ఖంగా ప్రవర్తిస్తే "ఈ రెండు నెలల గడువు దాటిన తర్వాత మావాళ్ళు నిన్ను చంపి, కూర వండి భోజనంలో నంజుకు తింటానికి నాకు పంపిస్తారని రాక్షసంగా మాట్లాడి మహోగ్ర కోపంతో ఊగిపోతూ అక్కడి నుండి వెడలి పోయాడు. కాపలాగా ఉన్న అక్కడి రక్కసి జనం రావణుడు పాడిన పాటలోని పల్లవినే పలుకుతూ, తాళం వేస్తున్నట్లు ఆ మాటలే తిరిగి తిరిగి వినిపించి, బాధించటం మొదలు పెట్టారు.

అందులో 'త్రిజట' అనే ఆమె, 'స్వప్నంలో రాముని విజయాన్ని, రావణ వినాశనాన్ని దర్శించి వారికి వివరించింది. అది విని వారంతా భయపడి దూరంగా జరిగి, నిద్రలోకి జారుకొన్నారు. ఆ త్రిజటా స్వప్నమే గాయత్రీ మంత్ర రహస్యార్థ వివరణమని రామాయణ పరమార్థం తెలిసిన పెద్దలు చెప్తారు.

"ఇంత బ్రతుకు బ్రతికి ఇట్టి దుష్టుని చేతిలో ఇన్ని కష్టాలు పడవలసి వచ్చిందే" అనే బాధతో సీత వృక్షమూలంలో నిలబడి కేశపాశం మెడచుట్టూ చుట్టుకొని చెట్టు కొమ్మకు ఉరిపోసుకొని ప్రాణ పరిత్యాగం చెయ్యటానికి సిద్ధపడింది.

## రామ కథా పరమార్థం

ఇదంతా చెట్టు మీద నుండి చూస్తున్న హనుమంతుడు ఆమెను ఆత్మహత్యా ప్రయత్నం నుంచి విరమింపజేయటానికై అప్పుడు అర్థవంతములైన మనుష్య భాషణములతో రామ చరిత్ర కీర్తన చేశాడు.

ఇది హనుమంతుని ఉచితజ్ఞకు మిక్కిలి పరీక్షాస్థానం. ఆ సమయంలో తొందరపడి పరొక విధంగా ప్రవర్తించినట్లయితే పరిస్థితి విషమించేది.

మధురాక్షర సంభరితములు, ధర్మయుక్తములు, శుభదాయకములు అయిన ఆ మాటలు ఆమె మానసిక వైకల్యాన్ని పోగొట్టి సంతోషాన్ని, ధైర్యాన్ని, బలాన్ని కలిగిస్తాయని ఆశించాడు. (జటాయువు అన్న సంపాతి విషయంలో పోయిన రెక్కలు తిరిగి రావటం ద్వారా లోగడ రామ కథకు ఆ విధమైన పరమార్థం సిద్ధించటం విదితమే కదా !)

రామాయణ పఠనం యొక్క పరమ ప్రయోజనం కూడా అదే అని మనం సంభావించవచ్చు. ఇందుకే ఇంత కాలంగా రామాయణం లోకంలో పౌరాణిక గ్రంథంగానే కాకుండా పారాయణ గ్రంథంగా కూడా గౌరవింపబడుతూ, మోడువారిన జీవితాలకు నిత్య వసంతాన్ని ప్రసాదిస్తోంది.

ఈ పరమ రహస్యాన్ని వివరిస్తూనే వాల్మీకితో ఆనాడు బ్రహ్మనీ ఈ రామ కథ ప్రపంచంలో కొండలు, నదులు ఉన్నంతకాలం ఉంటుందని అభిభాషించాడు. ఘనంగా ఆశీర్వదించాడు.

యావత్స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి॥

అశోక వనంలో తొలుత సీతను చూడటంతోనే హనుమంతుడు సముద్రాన్ని లంఘించి, లంకకు వచ్చిన పని పూర్తి అయిపోయింది. కనుక వెంటనే తిరిగివెళ్ళి, 'సీత' ఫలానా చోట ఉంది అని చెప్తే చాలు ఆతని బాధ్యత తీరిపోతుంది. అయితే అతడు సీతతో మాట్లాడి, ఆమెకు రాముని కుశల వార్త చెప్పి, జీవితంపై ఆమెకు కలిగిన నిరాశను తొలగింపక పోయినట్లయితే, రాముడు సపరివారుడై లంకకు వచ్చి, రావణుని సంహరించి ఆమెను పరిగ్రహించే లోపల ఏ అవాచ్యం జరుగుతుందో చెప్ప లేం సీత ఏమన్నదని రాముడు అడిగితే తానేం సమాధానం చెప్పాలి. మాట్లాడ లేదంటే రాముడేమంటాడు? అందుకే హనుమంతుడు ఆమెను ఊరడించే ఉద్దేశంతో ఈ ప్రయత్నం చేశాడు. ఇది ఆతని విజ్ఞతకు, సమయోచిత ప్రజ్ఞా పాటవానికి తార్కాణం. మాట విలువ తెలిసి, సమయానికి తగిన విషయం మాట్లాడ గలగటం ఒక కళ. ఆ కళలో హనుమంతుడు సిద్ధ హస్తుడు.



రామకథ శ్రద్ధగా విన్న సీత మరణోద్యమం మానుకొని మెల్లగా తల ఎత్తి చెట్టుపైనున్న హనుమంతుని చూచింది.

అతడు సీత దగ్గరకు వచ్చి, వినయంతో నమస్కరించి ఆమె ఎవరైనది అడిగి తెలుసుకొని, ఆమెయే సీతయని నిర్ధారించుకొని, ఆమె సందేహములకు సమాధానాలు చెప్తూ, రామ సుగ్రీవుల మైత్రి, సీతాన్వేషణాది వృత్తాంతము వివరించాడు. "ప్రియా రామకథాహిమే."

రామకథ అంటే నాకెంతో ఇష్టం అంటూ "నీవు రాముని చూచింది నిజమై నట్లయితే ఆతని నిరూప గుణ విలాసము లెటువంటివో వివరింపు"మని అడిగిన సీతకు "రామ సేవకే తన జీవితం అంకితం"గా భావించిన హనుమంతుడు తనను గూర్చి పరిచయం చేసి వానరుడనైన "నేను రామదూతనై తల్లీ నీకు ఆతని సందేశం అందించటానికై ఇక్కడికి వచ్చా"నని "ఆమెకు విశ్వాసం కలిగేలా మొదటి నుండి జరిగిన సంగతులన్నీ వివరించాడు. సీత యెడ రామునికి గల అసామాన్యమైన ప్రేమ వినిపించి ఆమెకు జీవితంపై ఆశ చిగురింప చేశాడు.

అహం రామస్య సందేశాద్దేవి ! దూతస్తవాఽఽగతః
వైదేహీ ! కుశలీ రామ, స్త్వాంచ కౌశల మబ్రవీత్॥ (2-34-5)

"రాముడు కుశలంగా ఉన్నాడు అమ్మా ! నీ క్షేమం అడగమన్నాడు" అని చెప్పాడు. ఆ మాటలు విన్న సీత "నాయనా ! ఇన్నాళ్ళు నేను కన్నీళ్ళతో, కడ గండ్లతో ఈ రక్కసి జనం మధ్యలో ఇన్ని బాధలు అనుభవిస్తూ బ్రతికి ఉన్నందుకు వినదగిన మాట విన్నాను. ఈ సమయంలో "బ్రతికియుండిన సుఖములు బడయ వచ్చు" అన్న మంచి లోకోక్తి గుర్తుకు వస్తోంది అంది.

కల్యాణీ బతగాథేయం, లౌకికీ ప్రతిభాతిమే।
ఏతి జీవన్తమానన్దో, నరంవర్షశతాదపి॥ (6-34-5)

సీత చెప్పిన ఈ లోకోక్తి కల్యాణ గాథగా, వాల్మీకిచే అభివర్ణింపబడింది. అంటే సత్యమును ప్రతిపాదించు శుభ చరితమని అర్థము. ఇట్టి సత్యము, శుభ దాయకము అయిన సచ్చరిత్రయే సమాజమునకు ఆదర్శమై అనర్థ పరంపరను నివారింప గలదని యనటం యథార్థము.

లంకలో కష్టముల కోర్చి బ్రతికి ఉన్నందువలననే రావణ సంహారం తర్వాత సీత రామునితో గూడి అయోధ్యలో పట్టాభిషిక్తురాలై జగత్కల్యాణమునకు కారణమై విరాజిల్లినది.

ఇదంతా పరిశీలించినప్పుడు సీత చెప్పింది అక్షరాలా 'కల్యాణ గాథ' అనేది నిజం. అసలు రామాయణమే ఒక 'కల్యాణగాథ' కనుకనే యుగయుగముల నుండి తరతరముల వారు విని, చదివి ఆనందం అనుభవిస్తున్నారు. ప్రచారం చేస్తున్నారు.

"భువి పుణ్య చరిత వినుట పుణ్యమకాదే" (భాగవతం. 9 స్కం. 3 ప.) అన్నట్లు సజ్జనులైన సీతారాముల చరిత్రయైన రామాయణం శుభదాయకమై, మానవాళికి మానసిక సంస్కారాన్ని కలుగజేస్తుంది. ధర్మం యెడ ఆసక్తిని పెంచుతుంది. చిత్తశాంతిని ప్రసాదిస్తుంది. విశ్వశ్రేయోదాయకమై విలసిల్లుతుంది.

అంజనానందనం వీరం, జానకీ శోకనాశనం।
కపీశ మక్షహం తారం, వందేలంకా భయంకరమ్॥

హనుమంతుడు ఇంకా ఆ సమయంలో సీతకు పూర్తి విశ్వాసం కలగటం కోసమై గుర్తుగా రామ ముద్రిక నిచ్చి ఆమెను దుఃఖమును విడిచి, నిర్భయంగా ఉండ వలసిందని ధైర్యం చెప్తూ, 'ఇంక నీకు శుభములు కలుగుతాయి' అని ఊరడించాడు.

వానరోఽహం మహాభాగే దూతోరామస్య ధీమతః।
రామ నామాంకితం చేదం పశ్య దేవ్యంగుళీయకమ్॥

ప్రత్య యార్థంతవానీతం తేనదత్తం మహాత్మనం।
సమాశ్వసిహి భద్రంతే క్షీణ దుఃఖ ఫలాహ్యసి॥ (2,3-36-5)



ఈ రెండు శ్లోకాలు నిత్యం పారాయణ చేసేవారికి దుఃఖములు తొలగి, శుభములు కలుగుతాయని సంప్రదాయం తెలిసిన పెద్దలు చెప్తారు. సీత అడిగిన దానికి సమాధానంగా హనుమంతుడు చేసిన విపులమగు రామ గుణాభి వర్ణన సందర్భంలో అతని యందు గల శాస్త్ర విషయ పరిజ్ఞానము, సూక్ష్మ పరిశీలనా శక్తి రామభక్తి తద్గుణానురక్తి వ్యక్తములయినాయి.

## ఎదుటి వారి మాటలలోని మంచిని మన్నించాలి

తిరిగి రామునెప్పుడు కలుసుకోగలుగుతానో అని విచారిస్తున్న సీతతో హనుమంతుడు అమ్మా ! 'నీవు నా వీపుపై కూర్చుంటే అగ్నిహోత్రుడు ఇంద్రునికి హవ్యమును చేర్చినట్లుగా నిన్ను త్వరగా నీ పతి సన్నిధికి చేర్చగలనని విన్నవించాడు. అది విని నవ్వుతూ "రూపంలో మిక్కిలి చిన్నవాడవు నీకు అదెలా సాధ్యపడుతుందని అడిగితే అతడు మహాపర్వత సదృశమైన తన రూపాన్ని ప్రదర్శించి, సీతమ్మ తల్లి ప్రశంస అందుకొన్నాడు. వేగంలోను, బలంలోను సాటిలేని మేటి వీరుడని నిరూపించుకొన్నాడు. అయినా బుద్ధి పూర్వకంగా పరపురుష స్పర్శ కూడా సహించని ఆమె హనుమంతుని వెంట బయల్దేరి వెళ్ళటానికి అంగీకరించలేదు సరికదా! రామ లక్ష్మణులేని సమయంలో తాను భయంతో వివశురాలై యున్నప్పుడు రావణుడు పిరికితనంతో తనను ఎత్తుకు వచ్చాడని అలా తానిక్కడ నుండి దొంగతనంగా బయట పడటం తనకు ఇష్టం లేదని చెప్పి నిరుపమాన తేజో బలపరాక్రమములు గల వీరాగ్రగణ్యుడగు రాముడు వచ్చి, రావణుని సంహరించి, తనను పరిగ్రహించటమే యుక్తమని అది తనకు, రామునకు గౌరవాన్ని ఇనుమడింపజేస్తుందని వివరించింది.

సీత అభిప్రాయం తెలుసుకొన్న హనుమంతుడు ఆమె మాటలలో గల ఆంతర్యం అర్థం చేసుకొని "రామ పత్నియైన సీతవు నీవు మాత్రమే అట్టి మాటలనటానికి సమర్థురాలవు"ని ఆమెను అభినందించాడు. ఎట్టి పరిస్థితులలోనైనా, నామాటే నెగ్గాలని, నా ఘనతయే ప్రకటితం కావాలని గొప్పలు పోయేవారికి హనుమంతుని ఈ నిర్ణయం ద్వారా ఎదుటి వారి మాటలలో గల సామంజస్యాన్ని, మంచిని గ్రహించి గౌరవించాలనే సత్యం నిరూపితమవుతుంది. (అట్టి సహృదయుడు కనుకనే సభా మంటపంలో చూచినప్పుడు దుష్టుడైన రావణునిలోని అధర్మాన్ని మాత్రమే నిరసించి

అతని రూపతేజో బల విక్రమములను ప్రశంసించాడు. శత్రువే అయినప్పటికీ అతని యందున్న గుణాన్ని గౌరవింప గల వీరాగ్రేసరుడు హనుమంతుడు.) (17,18-49-5)

### మాట పుణ్య కార్యం కొఱకే వినియోగించాలి

సీత వద్ద ఆనవాలుగా ఆమె శిరోరత్నాన్ని తీసుకొని సీతారాములు కలిసి అరణ్య వాసం చేస్తున్నప్పుడు ఒక రోజు జరిగిన కాకాసుర వృత్తాంతంతో బాటు ఆమె చెప్పిన సందేశాన్ని విని సెలవు తీసుకొని వెళ్ళిపోబోతున్న హనుమంతునితో సీత "నాయనా ! ఎలా చెబితే రాముడు నన్నీ చెఱ నుండి తప్పించి కాపాడుతాడో అలాంటి మాటలు చెప్పి పుణ్యం కట్టుకోమని కోరింది.

జీవంతీం, మాం యథా రామ, స్సంభావయతి కీర్తిమాన్।
తత్తథా హనుమన్వాచ్యం, వాచా ధర్మమవాప్నుహి॥ (10-39-5)

లోకంలో మాటకు ఉన్న విలువ చాలా గొప్పది. అది ప్రణయాన్ని, ప్రళయాన్ని కూడా సృష్టిస్తుంది. ఒకప్పుడామాట ప్రాణం పోయగలదు. మరొకప్పుడు అదే ప్రాణం తీయ గలదు.

అట్టి మాటను వ్యక్తిగత రాగ ద్వేషాలు లేకుండా, సమాజహితం కొఱకు వినియోగించటమే పుణ్యమని మహర్షి వాల్మీకి సంభావించాడు. ఆ విషయమే సీత నోట పలికించాడు.

"వాచా ధర్మ మవాప్నుహి"

"పరోపకారమే పుణ్యము, పరపీడనమే పాపము" కోటి గ్రంథముల సారమే ఈ సత్యము.

తర్వాత హనుమంతుడు రాముని సన్నిధికి చేరి సీత వర్తమానం చెప్పేటప్పుడు ఆమె క్షేమంగా ఉంది. నీయందు బద్ధానురాగయై నీ రాకకు ఎదురు చూస్తోంది, అని విన్నవించాడు. ఇందులో ఏది లోపించినా అంటే నీయందే ప్రేమ గల ఆమె జీవించి యుండలేదని గాని, లేదు బ్రతికి యున్నప్పటికి వేరొకరిమీద నసురక్తురాలై యున్నదని గాని చెప్పినట్లయితే రాముడు లంకకు రాడు. రావణ సంహారం చేయడు. ఆ కథ వేరుగా ఉండేది.

అందువల్ల హనుమంతుడు రామునితో సీతను గూర్చి ఈ విధంగా వివరించి చెప్పాడు.



"నియత స్సముదాచారో భక్తి శ్చాస్యా స్తథాత్వయి"
ఏవంమయా మహాభాగ : దృష్టాజనక నందినీ।
ఉగ్రేణ తపసాయుక్తా త్వద్భక్త్యా పురుషర్షభ॥ (17,18-65-5)

### దూ త క ర్త వ్యం

దూతయైన వాడు ఏదైనా ఒక విషయం ఉన్నదున్నట్లు చెప్పాలే కాని, చిలువలు పలవలు చేసి చెప్పరాదు. "కాళిదాసు కవిత్వం కొంత నాపైత్యం కొంత" అన్నట్లు ఉన్నవి, లేనివి చేర్చి చెప్తే అసలు విషయం మఱుగున పడిపోతుంది. అనవసరమైన వాటికి ప్రాధాన్యం సిద్ధిస్తుంది. అలాంటప్పుడు నిర్ణయాలు వేరొక విధంగా జరుగుతాయి. అందువల్ల దూతకు యథార్థ కథనం ఒక ముఖ్య లక్షణం. పొల్లు మాటలు దొర్లితే పొరపొచ్చాలు వస్తాయి. అనర్థ పరంపరలు జరిగి పోతాయి.

సీత హనుమంతునితో "నాయనా ! మాట చెప్పి పుణ్యం కట్టుకోరా" అని చెప్పిన దానికి ఇంత అర్థం ఉంది. పరేంగిత జ్ఞాన సంపన్నుడు, వాక్యజ్ఞుడు, వాగ్విశారదుడు ఐన హనుమంతుడు ఆమె ఆవేదనను సరియైన మాటలలో సముచితమైన రీతిలో రామునకు విన్నవించి తన కర్తవ్యమును చక్కగా నిర్వహించాడు. సీతా రాముల కలయికకు ప్రధాన కారణమైనాడు. అందుకే ఋశ్యమూక పర్వత సమీపంలో మొదటగా రాముడు హనుమంతుని చూచినప్పుడు ప్రతిభావంతమైన అతని మాటల ధోరణిని గమనించి "ఇట్టి గుణ గరిష్ఠుడైన వాడు ఎవరికి దూతగా లభిస్తాడో అతనికి సర్వ కార్యములు సిద్ధిస్తాయని" వెల్లడించాడు. అతని మాటలు అక్షరాలా నిజమయ్యేలా చేసి తన సామర్థ్యాన్ని నిరూపించుకొన్నాడు హనుమంతుడు.

ఏవం గుణ గణై ర్యుక్తా యస్యస్యుః కార్యసాధకాః।
తస్య సిధ్యంతి సర్వార్థా దూతవాక్య ప్రచోదితాః॥ (35-3-4)

### "ధర్మ ఏవహతో హంతి, ధర్మోరక్షతి రక్షితః"

భారతీయ సంస్కృతిలో ఏ పని సంకల్పించినా అందుకు ధర్మమే పరమ లక్ష్యంగా సూచింపబడింది. వివిధ ఆగమములు, పురాణములు, ఇతిహాసములు మొదలైనవి అన్నియు ధర్మ ప్రతిపాదనకే ఉద్దేశింపబడినవి. కామశాస్త్రం వ్రాసిన వాత్స్యాయనుడు కూడా ధర్మం కొఱకే తన రచన సాగించానని ప్రకటించాడు. అందువల్ల ధర్మ సంపాదనమే అన్నింటికి ముఖ్య ఫలంగా సంభావించటం జరిగింది. ధర్మ

బద్ధమైన అర్థం, ధర్మబద్ధమైన కామం కోరుకోవాలి. ఈ విషయం తెలియజేయటానికే ధర్మార్థ కామములను ఆక్రమములో వర్ణించి అవి మోక్షమునకు దోహదం చేస్తాయని నిరూపించారు. అంతేకాదు అట్టి సత్ప్రవర్తన మానవత్వాన్ని సూచిస్తుందని, తద్విరుద్ధభావన రాక్షసత్వానికి ప్రతీక చెప్తూ రామ, రావణ చరిత్రలే అందుకు ఉదాహరణంగా రామాయణంలో మనకు తెలియజేశారు. మహాత్ములు కొందరు ధర్మము కొఱకు అర్థ కామములను త్యజించుటయు సంభవమే. అది వారి దైవీగుణ సంపదకు తార్కాణము, రావణుడు స్వార్థపరుడై తన సుఖం కోసం తన వారందరిని బలిపెడితే, రాముడు తన వారి మేలుకోరి స్వసుఖాన్ని త్యాగం చేశాడు. ధర్మమును ఆచరించే సందర్భములలో అతడు అర్థ, కామములను లక్ష్యపెట్టలేదు. చేతికి వచ్చిన రాజ్యాన్ని, చేర వచ్చిన కాంతను (శూర్పణఖ) లెక్క చెయ్యలేదు. అవి ధర్మవిరుద్ధములు కనుక కాదన్నాడు. పితృ, సత్యవాక్య పాలన, ఆశ్రిత జనరక్షణ మొదలైన ధర్మములను విడువలేదు. మరువలేదు. కనుకనే లోకారాధ్యుడైనాడు రాముడు. రావణుడు అర్థ కామములకై, ధర్మమును భంగ పరిచినవాడు కావున రాక్షసుడుగా వర్ణింపబడ్డాడు. చివరకు వినాశనాన్నే పొందాడు

## స మ య స్ఫూ ర్తి

సీతమ్మ దగ్గర సెలవు తీసుకొని, దూరంగా వచ్చి హనుమంతుడు తన కర్తవ్యాన్ని గూర్చి ఆలోచించి, దూతయైన వాడు ప్రభువు చెప్పిన పని చేయటంతో బాటు మరికొన్ని పనులు అధికంగా సాధించటం నేరం కాదని నిర్ణయించుకొన్నాడు.

"కార్యే కర్మణి నిర్దిష్టే, యోబహూన్యపి సాధయేత్।
పూర్వకార్యా విరోధేన సకార్యం కర్తుమర్హతి॥" (5-41-5)

ఈ లంకాధిపతియైన రావణుని చూచి, ఆతని బలవైభవాన్ని, సైన్య ప్రాభవాన్ని పరిశీలించి, రామ పరాక్రమాన్ని వర్ణించి చెప్పి ఆ రావణుని గుండె ధైర్యాన్ని త్రుంగదీసి, ఆతనికి బుద్ధి చెప్పటం కర్తవ్యంగా భావించాడు. అందుకు తగిన వ్యూహరచన చేసికొని సమయస్ఫూర్తితో వ్యవహరించాడు.

రావణుని దర్శనం సామాన్యులకు లభించడం సాధ్యమా ? అది సిద్ధించాలంటే "అతనికి ప్రాణప్రదమైన అశోకవనాన్ని నాశనం చెయ్యాలి. ఫల సేకరణ పేరుతో వృక్షములు పెకలించడం మొదలు పెట్టాడు. కాపలాదారులు అతనిని ఎది



రించి చావుదెబ్బలు తిన్నారు. ఇంతలో కొందరు వెళ్ళి ఈ సంగతి రావణునకు చెప్పారు. రావణుడు వరుసగా సైనికుల్ని, సేనా నాయకుల్ని, మంత్రి పుత్రుల్ని, అక్ష కుమారుని పంపించాడు. హనుమంతుడు వారిని శిలలతో, పాదపములతో, చేతులతో, కాళ్ళతో మర్దించి సంహరించాడు.

ఆ సందర్భంలో హనుమంతుడు బిగ్గరగా రామకీర్తన చేస్తూ ఉత్సాహాన్ని సంతరించుకొని అవలీలగా ఆ రాక్షస సంహారం చేయగలిగాడు. రామనామ మహిమకిది నిదర్శనం. (రామ చరిత్ర విన్న జటాయువు అన్న సంపాతికి పోయిన రెక్కలు తిరిగి రావటం కూడా మరొక ఉదాహరణం)

జయత్యతి బలో రామో, లక్ష్మణశ్చ మహాబలః।
రాజా జయతి సుగ్రీవో, రాఘవేణాభి పాలితః॥
దాసోఽహం కోసలేంద్రస్య, రామస్యాక్లిష్ట కర్మణః।
హనుమాన్ శత్రుసైన్యానాం నిహంతా మారుతాత్మజః॥
నరావణ సహస్రంమే యుద్ధే ప్రతిబలం భవేత్।
శిలాభిస్తు ప్రహరతః పాదపైశ్చ సహస్రశః॥
అర్దయిత్వా పురీంలంకాం, యభివాద్యచ మైథిలీం।
సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్॥ (33to36-42-5)

సుందరకాండ నిత్యం పారాయణ చేయటానికి అవకాశం లేనివారు ఈ నాలుగు శ్లోకాలు చదువుకో గలిగితే మొత్తం కాండ పారాయణ చేసిన ఫలం లభిస్తుందని వ్యవహార జయం సిద్ధిస్తుందని సంప్రదాయం తెలిసిన పెద్దలు చెప్తున్నారు.

శత్రునిహంతయైన హనుమంతుడు వేయిమంది రావణులైనా నా ఎదుర నిలువలేరని ప్రకటింప గల వీరుడయ్యు ధర్మాత్ముడు నిత్య సత్యవ్రతుడు అయిన రామునికి తాను దాసుడనని వినయంతో విన్నవించుకొన్నాడు.

"ఎంతటి వారైనా, ధర్మం యెడ తలయొగ్గి తీరవలసిందే. అధర్మాన్ని ప్రతిఘటింపవలసిందే" అనేది ఇందులో హనుమంతుని అంతర్యంగా మనం గ్రహింపవచ్చు.

తన చిన్న కుమారుడైన అక్షుడు కూడా మరణించటంతో రావణుడు బెంబేలు పడిపోయి, గత్యంతరం లేని స్థితిలో పెద్ద కొడుకు ఇంద్రజిత్తును హనుమంతుని పైకి యుద్ధానికి పంపించాడు. అతడు వివిధ శస్త్రాస్త్రాలు ప్రయోగించి ప్రయోజనం లేక తుదకు బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు. బ్రహ్మ వరములు పొందిన హనుమంతుని అది ఏమీ చేయలేకపోయినప్పటికి, దానియందుండే గౌరవం చేత అతడు కట్టుబడినట్లు వ్యవహరించి, రావణుని చూచి అతనికి బుద్ధి చెప్పటానికి అదీ ఒక అవకాశం గానే భావించి అతని సభాభవనానికి వెంట నడిచాడు.

రావణుని సభలో తాను రామదూతనని చెప్పి "రావణుడు చేసిన పని నేరమని వివరించి ఇప్పటికైనా బుద్ధి తెచ్చుకొని, సీతను అతనికి అప్పగించి శరణు వేడితే రాముడు క్షమించగలడని ప్రబోధించాడు.

రామ, రావణుల బలపరాక్రమముల నడుమ గల తారతమ్యమును తులనాత్మకంగా వివరించి రావణుని అల్పత్వమును అనేక విధాలుగా నిరూపించాడు.

1) రావణుడు కదలింపలేని శివుని విల్లు, అనాయాసంగా ఎక్కుపెట్టు విరచివేసిన వాడు రాముడు.

2) రావణుని జయించి కారాగారంలో బంధించినవాడు కార్తవీర్యార్జునుడు. అతనిని సంహరించినవాడు భార్గవ రాముడు. అతని బల గర్వం అణచి వేసినవాడు దశరథ రాముడు

3) రావణుని చంకలో ఇరికించుకొని నాలుగు సముద్రములలో ముంచి తేల్చినవాడు వాలి. అతనిని ఒకే ఒక బాణంతో చంపి యమపురికి అతిథిగా పంపినవాడు రాముడు.

4) రావణుని మూల బలములని చెప్పబడుతూ, మునుల పాలిటి మృత్యువుగా పేరుపడ్డ ఖరదూషణాది రాక్షస సమూహమును మట్టి పాలు చేసిన వాడు రాముడు.

"మహా వీరుడైన ఆతని విక్రమమును గురించి, ఇలా చెప్పవలసినవి ఇంకా ఎన్నో ఉన్నాయి. ఇప్పటికైనా బ్రతుకు మీద ఆశ ఉంటే రాముని శరణు వేడుమని రావణుని హెచ్చరించాడు హనుమంతుడు.



బ్రహ్మేంద్ర రుద్రాదులెవ్వరైనా రామునిచే చంప నుద్దేశింపబడిన వానిని రక్షింపజాలరని భయపెట్టాడు.

పైన చెప్పిన వారిలో విష్ణువు లేకపోవటం, "ఈ రాముడే ఆ విష్ణువు" అనే రహస్యాన్ని వివరిస్తోంది.

ఉల్లంఘ్యసింధో స్సలిలంసలీలం, యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః ।
ఆదాయతేనైవదదాహలంకాం, నమామితం ప్రాంజలి రాంజనేయమ్ ॥

ఈ మాటలు విన్న రావణుడు కోపంతో ఊగిపోతూ హనుమంతుని చంపండని అచటి పరివారాన్ని ఆజ్ఞాపించాడు. దూతను చంపటం ధర్మం కాదని, అలా చేయటం వలన మన అభిప్రాయం ఎదుటి వారికి తెలిసే అవకాశమే ఉండదని, అదీకాక ఇంత చదువు చదువుకొని విజ్ఞత కోలుపోయినట్లైతే బరువులుమోసే గాడిదకు, శాస్త్రవచనాలు వల్లించే పండితునికి తేడా ఏమిటని ప్రశ్నించి విభీషణుడు ఆ దుష్కార్యము నుండి రావణుని వారించాడు.

"అయితే వానరులకు తోక అంటే చాలా ఇష్టమని. హనుమంతుని తోకకు నిప్పంటించ"మని రావణుడప్పుడు తనవారిని ప్రేరేపించాడు. పట్టణంలో ఉన్న పాత గుడ్డలన్నీ చేర్చి నూనెతో తడిపి వారు హనుమంతుని తోకకు చుట్టి నిప్పంటించారు. అతనిని పట్టణంలో ప్రదర్శించి వినోదించారు.

## ఎవరు తీసుకొన్న గోతిలో వారే పడతారు

పగటిపూట పట్టణం చూడటానికి తగిన అవకాశంగా భావించిన హనుమంతుడు అన్నిటినీ జాగ్రత్తగా పరిశీలిస్తూ తోకకున్న నిప్పుతోనే ఒక్క విభీషణుని భవనాన్ని విడిచిపెట్టి తక్కిన గృహములన్నీ దహించాడు. పట్టణంలోని ప్రజలంతా వీధులలో పరుగులెత్తుతూ హాహాకారాలు చేస్తూ రావణుని దుర్నీతిని ఉపేక్షించినందుకు తమకు కలిగిన ఫలమిదియని దుఃఖిస్తూ విలపించారు. అధర్మమని తెలిసి ఖండించకపోవటం కూడా నేరమేనన్నమాట.

హనుమంతుని తోకకు నిప్పంటించారన్న వార్త విన్న సీత అతనికి ఏ ప్రమాదము జరుగకూడదని కోరుతూ చల్లదనాన్ని ప్రసాదించమని అగ్నిహోత్రుని ప్రార్థించింది. అతడామె విన్నపాన్ని మన్నించాడు.

లంకంతా దహించి, సముద్ర జలాలలో ముంచి తోకని చల్లార్చుకొని తనకు ఏ విపత్తు కలగకుండా ఉండటానికి సీత పాతివ్రత్య మహిమయే కారణమని సంభావించాడు. శిరసున అంజలి ఘటించి ఆమెకు అక్కడనుండే నమస్కరించాడు. హనుమంతునికి విజ్ఞతతోబాటుగా గల వినయం ఆతని వ్యక్తిత్వానికి వన్నె. వాసి తెచ్చి పెట్టింది. బంగారానికి పరిమళం అబ్బటమంటే ఇదేనేమో.

అంతలో వెనుదిరిగి చూచేటప్పటికి లంక మొత్తం మంటలలో కాలి బూడిద అయిపోవటం చూచాడు. తన తల్లి జానకికి కూడా ఏమైనా ప్రమాదం వాటిల్లిందేమో నని దుఃఖించాడు. తానింతదూరం కష్టపడి వచ్చి చేసిన నిర్వాకం ఇదా అని విచారించాడు. తను తెలియకుండానే తప్పు చేశానేమో అని బాధపడ్డాడు.

ఆకాశ సంచారులైన చారణులు కొందరు లంకంతా దహింపబడ్డా, సీత క్షేమంగా ఉండటం చూచి ఆమె పతివ్రతా మహిమను కొనియాడటం విని సంతోషించి

"ననశిష్యతి కల్యాణి, నాగ్నిరగ్నే ప్రవర్తతే"

పాతివ్రత్య తేజోవిరాజితయైన సీతను అగ్నిహోత్రుడేమీ చేయజాలడని విశ్వసించాడు. అగ్నిని, అగ్ని దహించదుకదా ! అని సమాధాన పడ్డాడు. "తనకు ఏ విధంగాను బాధ కలుగకుండా కాపాడ జాలిన ఆ మహాస్వాధ్వికి, ఆత్మ సంరక్షణ విశేషమేమీకాదనే నిర్ణయానికి వచ్చాడు.

రావణ సంహారానంతరము జరిగిన సీతాగ్ని ప్రవేశ ఘట్టము ఆ విషయాన్నే నిరూపించింది.

తిరిగి మరల ఒకసారి సీతా మాతను సందర్శించి, ఆమెకు నమస్కరించి ఆశీర్వాదములు పొంది, సపరివారుడైన రాముడు త్వరలో వచ్చి రావణ సంహారం చేసి ఆమెను పరిగ్రహింపగలడనే ధైర్యవచనములు చెప్పి ఆలోగా ఆమెను ఏ అఘాయిత్యమునకు పూనుకొనవలదని ప్రార్థించి, ఆమె వద్ద సెలవు తీసుకొని, సముద్ర తీరం చేరి, ఆవలి ఒడ్డుకు పోవటానికై మహోత్సాహంతో ఆకాశంలోకి ఎగిరి, ప్రయాణం సాగించాడు.

ఇంకొద్ది సేపటిలో ఆవలి తీరం చేరుకోబోతున్నాడనగా హనుమంతుడు తన రాకను తెలియజేస్తూ నోటితో పెద్ద శబ్దం చేశాడు. అది విన్న జాంబవంతుడు అది



హనుమంతుని విజయఘోషగా గుర్తించి వానర వీరులందరిని ఒకచోట చేర్చి ఆ విషయం వెల్లడించాడు.

ఉత్సాహంతో అంతట వారంతా ఆ పర్వతం పైనున్న చెట్ల నధిరోహించి పూల గుత్తులు, ఆకు కొమ్మలు ధరించి ఆకాశంలోకి ఊపుతూ హనుమంతునికి స్వాగతం పలుకుతున్న సమయంలో హనుమంతుడు సమధికోత్సాహంతో ముందుకు సాగివస్తూ "దృష్టామయాసీతా" "చూశాను సీతను" అనే శుభవార్త వినిపించాడు. ఉద్విగ్నమనస్కులైన వారికి హనుమంతుడా విషయం చెప్పిన తీరు ఆతని వాక్ప్రయోగ కుశలతను వెల్లడిస్తుంది. అది సహృదయ హృదయంగమం.

ఇంతసేపు ఎదురుతెన్నులు చూస్తూ ఏ వర్తమానం కొఱకు వేచి ఉన్నారో ఆ మంచి మాట వినేటప్పటికి వారంతా ఉబ్బి గంతులు వేశారు. హృదయ పూర్వకంగా వారందరు హనుమంతుని అభినందించారు. యువరాజైన అంగదుడు గండం గడిచి, బయటపడ్డందుకు ఆనందించాడు. హనుమంతుని ప్రశంసా వాక్యములతో గౌరవించాడు.

జాంబవంతుని అధ్యక్షతన జరిగిన సభలో హనుమంతుడు ఇక్కడ బయలుదేరి తాను లంకకుచేరి, సీతను సందర్శించి వనము పెకలించి, రాక్షసుల సంహరించి రావణుని హెచ్చరించి, లంక దహించి వచ్చిన విషయమంతా విపులంగా వివరించాడు.

అతని బుద్ధి చాతురిని, సాహస కృత్యములను విని ఆశ్చర్యపడి వారు పదేపదే ప్రశంసించారు. అందరు కలిసి కిష్కింధకు బయలుదేరారు. పట్టణం దగ్గరిలోకి రాగానే మధువనంలో ప్రవేశించి తేనెలు త్రాగాలనిపించి హనుమంతుని కోరారు. అతడు అంగీకరించాడు. ఆవార్త విని మధువనం పాడుచేశారన్న కోపం లేకుండానే సుగ్రీవుడు వారినందరిని సాదరంగా పిలువబంచి పరిస్థితులవగాహన చేసుకొని రామలక్ష్మణులతో "హనుమదాదులు సీతను సందర్శించి వచ్చా"రన్న సంగతి సంతోషంతో తెలియజేశాడు.

సుగ్రీవాజ్ఞ తలదాల్చి, అచ్చట చేరిన వానర వీరులలో సీతను చూచి వచ్చిన హనుమంతుని చేరబిల్చి, రాముడు ఆతని ప్రయాణ విశేషాలు వివరించమని అడిగాడు.

హనుమంతుడు సీత క్షేమవార్త చెప్పి, ఆమె ఇచ్చిన చూడామణిని, రాముని కిచ్చి, ఆమె చెప్పిన కాకాసుర వృత్తాంతం వినిపించి సీత సందేశం వివరించాడు. అది విని కృతజ్ఞతాధర్మం తెలిసిన రాముడానందంతో అపురూపమైన తన కౌగిలి ఇచ్చి సన్మానించి, హనుమంతుని పరాక్రమాన్ని గొప్పగా సంభావించాడు.

"ఇతరులు మనసుతో కూడా ఊహించలేని దుర్లభమైన ఈ మహత్కార్యాన్ని సమర్థతతో హనుమంతుడు సాధించాడని అభినందించాడు. సీత వార్త తెలియజెప్పిన ఇతని వలన తాను, లక్ష్మణుడేగాక, రఘువంశము సర్వము ఆపదలు పాలు కాకుండా రక్షింపబడిందని ప్రకటించాడు.

కృతం హనుమతాకార్యం, సుమహద్భు విదుర్లభం ।
మనసాపి యదన్యేన, నశక్యం ధరణీతలే ॥ (2-1-6)

అహంచ రఘువంశశ్చ లక్ష్మణశ్చ మహాబలః ।
వైదేహ్యాదర్శనే నాద్యధర్మతః పరిరక్షితః ॥ (11-1-6)

హనుమంతుడు తన సహచరులగు అంగదుడు, జాంబవంతుడు మొదలైన వానర వీరుల సమక్షంలో లంకాయాత్ర వివరాలు చెప్పినప్పుడు తన విక్రమాన్ని గూర్చి వర్ణించాడేగాని సీత చెప్పిన సందేశాదులు వివరించలేదు.

ప్రభువైన రాముని సన్నిధిలో చెప్పినప్పుడు అభిజ్ఞానము సీతా సందేశము, లంకా రహస్యములు వివరించాడేగాని తన పరాక్రమా లోపముల గూర్చి చెప్పలేదు.

ఎవరి దగ్గర, ఏ విషయం, ఎంత వఱకు ఎలా ప్రస్తావించాలో బాగా తెలిసిన సంయమి హనుమంతుడు. అతని ఉచితజ్ఞత, వాక్పటుత్వము ప్రపంచానికి ఆదర్శము, అనుసరణీయము అనుట సత్యము. అంతటి మనిషి కావుననే రామ ప్రశంసకు పాత్రుడై సీత యభిమానకు అర్హుడై ప్రభు దంపతులతో సమానముగ లోకమున ప్రజలచే ఆరాధింపబడుచున్నాడు.

అన్నింటను మహిమాన్వితుడగు అతని మించినవాడు వేరొకడు లేడని వాల్మీకి రామాయణంలో ప్రశంసించాడు.



పరాక్రమోత్సాహ, మతి, ప్రతాప
సౌశీల్య, మాధుర్య, నయానయైశ్చ
గాంభీర్య, చాతుర్య, సువీర్య, ధైర్యై
హనూమతః కోఽప్యధి కోఽస్తిలోకే ॥

విభీషణ శరణాగతి సందర్భంగా రామునకు సుగ్రీవాది వానర వీరులు పలు విధములైన అభిప్రాయములు వెల్లడించి, శత్రువైన రావణుని తమ్మునికి ఈ కష్ట సమయంలో ఆశ్రయమివ్వటం సమంజసం కాదని చెప్పినప్పుడు బుద్ధి కుశలుడైన హనుమంతుడు సౌజన్యమూర్తియైన విభీషణుని మనోగతాభిప్రాయాన్ని చక్కగా వివరించి 'సర్వలోక శరణ్యుడు, అభయదాన వ్రతుడు అయిన రామునికి ప్రీతి పాత్రుడయ్యాడు.

యుద్ధ రంగమున మూర్ఛ నొందిన లక్ష్మణునికై సంజీవినీ పర్వతం తెచ్చి అతని బ్రతికించాడు, కపి సమూహాన్ని తన ధీ బలశక్తితో కాపాడాడు.

రావణుని మరణవార్త వినిపించి సీతకు సంతోషాన్ని కలిగించాడు. రామాగమన వార్త వినిపించి భరత శత్రుఘ్నులను రక్షించాడు.

అయోధ్యలో రామ పట్టాభిషేక సందర్భంలో రాముడు తన పరివారం చేత వానరుల కందరికి ఎన్నెన్నో కానుక లిప్పించి గౌరవింపజేశాడు.

హనుమంతునికి మాత్రము తన పట్టమనిషి, జగన్మాతయైన సీత చేత సత్కరింపచేశాడు అది అతని, నిస్వార్థ సేవా భావమునకు చిహ్నంగా ప్రభువు గావించిన ఘన సన్మానము.

యత్ర యత్ర రఘునాథ కీర్తనం, తత్రతత్ర కృత మస్తకాంజలిం
భాష్పవారి పరిపూర్ణలోచనం, మారుతింనమత రాక్షసాంతకమ్ ॥

శ్రీరామ పదారవింద భజనానందుడై రామనామ మహిమమును లోకమునకు చాటి చెప్పిన మహనీయుడు హనుమంతుడు. (గయోపాఖ్యాన మీ విషయమునకు ప్రబలోదాహరణము.)

ధరనెన్ని పుణ్యతీర్థములైన గలుగనీ
రామనామము సరిరావు తలప
నిర్మలస్థితి మించు నిధులెల్ల గలుగనీ
రామనామము సరిరావు తలప
నానా విధములైన దానముల్ గలుగనీ
రామనామము సరిరావు తలప
నతిశయంబగు మహావ్రతములు గలుగనీ
రామనామము సరిరావు తలప

రామనామంబె సారంబు, రామభద్ర
రామచంద్ర రఘూద్వహో రామయనుచు
ననయము జపింపవలయు తక్కినవియెల్ల
రామనామంబునకు సరిరావు తలప.

రామావతారము సమకాలీనులైన వారికి మేలుచేసి, మోక్షమును ప్రసాదించింది. రామనామము సర్వకాల, సర్వావస్థలయందు సకల ప్రపంచమునకు తారక మంత్రమై ఇహ పర సుఖసాధనమై శాంతిదాయకమై వరలుచున్నది.

ఈ రహస్యమును గుర్తించి, ఆచరించి లోకమునకు ఉపదేశించిన పరమ గురువు హనుమంతుడు.

## హరిహరా ద్వైతము

శివాంశ సంభూతుడై శ్రీరాముని సేవించి ధన్యత గాంచిన హనుమంతుడు అద్వైత తత్వమును ఆచరణము ద్వారా లోకమునకు బోధించిన మహా వేదాంతి. ఆతని



సచ్చరిత్రము శివకేశవా భేదమును ప్రతిపాదించి, భక్తకోటికి శాంతిసుఖములను పెంపొందించును.

శివునంశన్ జనియించి రాము పదముల్ సేవించి యద్వైత త
త్త్వ విచారంబునఁబండి తోత్తములకున్ వాదోపవాదాళి మా
న్పి, విశిష్టంబగు బోధసల్పితి మహావేదాంతివై దాంతివై
స్తవనీయప్రియ! సచ్చరిత్రుడ ! నినున్ ధ్యానింతునో పావనీ (రచయిత)

## భీముని గర్వభంగము

గంధమాదన పర్వతమున భీమునకు దర్శనమిచ్చి, బలగర్వితుడగు నాతనికి దయతో జ్ఞానోదయము కలిగించి వరబలము లొసంగిన మహాబలుడు హనుమంతుడు సర్వ విధముల సజ్జన సాంగత్యము సకల శ్రేయోదాయకమను సత్యమిట నిరూపింప బడినది.

బలగర్వంబునఁ గన్నుగానక వృథా పంతంబులంబల్కి-, యు
జ్వలశక్తి ప్రకరు, న్నినుం, గదిపి, తేజస్ఫూర్తి, గోల్పోయి, సి
గ్గిలి, ప్రార్థింప విరోధి సైన్యము దృఢిం గెల్వంగనే శక్తి సం
ధిలుసీటీవు మహాత్మ ! భీము దయతో దీవింపవే పావనీ !

## నరుని విజయుని గావించుట

కురు పాండవ సంగ్రామమునందు అర్జునుని రథముపైన గల ధ్వజము దివ్య తేజముతో ప్రకాశించుచు, ఆతనికి శత్రు సంహార దక్షతను గూర్చి అధర్మ ప్రతి ఘటనమునకు సహకరించిన ప్రఖ్యాత బల పౌరుషశాలి హనుమంతుడు.

కురుసేనల్ నలు మూలలం గదియుచున్ క్రోధోగ్రభావంబునన్
నరుతో నైక విధాస్త్ర సంచయబలోన్మాదంబు నందాక, సం
గర రంగంబున, గ్రీడికిన్ రిపులమూకల్ చీల్చి చెండాడగా
నురు శక్తిం గలిగింపనై, ధ్వజము నందున్నావుగా పావనీ.

హనుమంతుని స్మరించిన వారికి ఎల్లవేళల సకల శుభములు సంప్రాప్తించును.

బుద్ధి, ర్బలం, యశో, ధైర్యం, నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ, హనుమత్స్మరణాద్భవేత్.



బలమున్ గౌశలమున్, యశోధనము, సంపత్సిద్ధి కల్పించు, వి
ద్యల సారంబు, విశేష ధైర్య మహిమంబారోగ్య ముద్యోగము
జ్వల వాక్ప్రౌఢి నొసంగు నీ చరణ కంజాతంబు లెల్లప్డు ని
శ్చల భక్తిం భజియించు వారల కవశ్యం బెన్నడున్ బావనీ !

లోకంలో మనకు లేనిది అది ఉన్నవాని నడిగి తెచ్చుకోవటం జరుగుతోంది. సద్గుణములకు నెలవైన హనుమంతుని ఆ సుగణసంపదలిమ్మని కోరుకొందాం.

శౌర్యము, దాక్ష్యము, బల
మతిధైర్యము ప్రాజ్ఞత, నయ, మురుతర విక్రమము
మాకార్యము సిద్ధి, ప్రభావం,
బార్యస్తుతుడైన హనుమయందె కలనిలన్.

